

# మామయ్య

తెలుగు బాలల మాసపత్రిక

సంపుటి: 2 సంచిక: 6,
హైదరాబాద్, జూన్ 2008,
పేజీలు: 52 వెల:
రూ. 10/-







అరిబండి బాలసాహిత్యం ట్రస్టు

పై కవరు:

నేటి బోధన

ఈ కవరు:

1-4 పేపరు తయారీ 5. మొట్టమొదట పేపర్ తయారీకి వాడిన ప్యాపిరస్ చెట్టు

6. ప్యాపిరస్ చెక్కతో పేపర్ తయారీ 7. ప్యాపిరస్ చెక్క పేపరుతో చేసిన పుస్తకం




























సంపుటి : 2 జూన్ - 2008 సంచిక : 6




చిరునామా
ఎడిటర్, మామయ్య బాలల మాసపత్రిక,
ఇం.నెం. 1-1-187/1/2, వివేక్‌నగర్, చిక్కడపల్లి,
హైదరాబాద్-500 020
ఫోన్: 040-27620887, ఫ్యాక్స్: 040-27620887
సెల్ : 94900 98903
mamayya_bs@yahoo.co.in,
**Website:** www.balasahityam.org



సంపాదకీయం

# బాలలు - హక్కులు

**మా**నవ హక్కుల్లో భాగంగా ఐక్యరాజ్య సమితి 1989లో ప్రపంచ బాలలకు ప్రత్యేకమైన హక్కులను కలిగిస్తూ ఒక తీర్మానాన్ని ఆమోదించింది. ఈ తీర్మానం 1990లో చట్టంగా మారింది. దీని ద్వారా గరిష్ట పెరుగుదలకు బాలలకు హక్కు ఏర్పడింది. ఈ హక్కు పూర్తిగా అమలు కావాలంటే మంచి ఆహారం, వైద్యం ఆడేందుకు పాడేందుకు సౌకర్యాలు, విద్య అవసరం. ఈ చట్టానికి మన దేశంతో సహా దాదాపు 180 దేశాలు కట్టుబడి ఉండడానికి అంగీకరించాయి.

బాలల పెంపు బాధ్యత ప్రధానంగా తల్లిదండ్రుల మీద లేదా వారి సంరక్షకుల మీద ఉంచబడింది. ఈ హక్కులను అమలు చేయించే బాధ్యత ఆయా దేశాల ప్రభుత్వాల మీద ఉంచబడింది. ఏ కారణం చేతనైనా తల్లిదండ్రులు లేదా పోషకులు, ముఖ్యంగా పేదరికంవల్ల, ఈ బాధ్యతను సరిగ్గా నిర్వర్తించలేని స్థితిలో ఉన్నప్పుడు అటువంటి బాలల అభివృద్ధికై అవసరమైన వనరులను, ఏర్పాట్లను కల్పించే బాధ్యతను ఆయా ప్రభుత్వాలకు అప్పగించబడింది.

బాలలు మన జాతి సంపద. ఈ సంపద పెంపుదలకై కృషి చేయాల్సిన బాధ్యత జాతి మొత్తం మీద ఉన్నది. మన ప్రతినిధిగా ఈ బాధ్యత మన ప్రభుత్వంపై ఉన్నది. అందుకనే భారత ప్రభుత్వం ప్రాథమిక ఉచిత విద్యను మౌలిక హక్కుగా రాజ్యాంగంలో చేర్చింది. బాలల గరిష్ట అభివృద్ధికి ప్రాథమిక విద్యతోపాటు సరైన పోషక ఆహారం, వైద్యం, ఆటల వసతులు, కనీస స్థాయిలోనైనా హైస్కూల్ విద్య, వృత్తి విద్య అవసరం. కాని ఈ హక్కులను బాలలందరూ అనుభవించడంలో ఎన్నో లోపాలు జరుగుతున్నాయి. బాలల పెరుగుదలకై వివక్షలేని అవకాశాలు అందడంలేదు. ప్రస్తుత విద్యావిధానం సమానత్వం సాధించేదానికి బదులుగా శాశ్వత అసమానతలను పెంచుతుంది. ఇది మన జాతి భవిష్యత్‌కు మంచిది కాదు. బాలల పెంపకంలో ఈ పద్ధతి మారాలి. గరిష్ట బాలల పెరుగుదలకై ఉన్న హక్కును అందరూ అనుభవించగలగాలి.

బాలల హక్కుల గురించి చెప్పాలంటే పేద కుటుంబాల బాలల హక్కుల గురించే నేడు మాట్లాడాల్సి వస్తుంది. ఎందుకంటే మధ్యతరగతి, ధనిక కుటుంబాలలోని బాలల అభివృద్ధికి అవసరమైన ఏర్పాట్లను వారి తల్లిదండ్రులు లేదా పోషకులు ప్రైవేట్ రంగంలో చేయగలుగుతున్నారు. కాని పేద కుటుంబాల పిల్లలు గరిష్ఠ అభివృద్ధికి ప్రభుత్వ సౌకర్యాల మీదనే ఆధారపడాల్సి వస్తుంది. వీని నాణ్యత ఏ మాత్రం సంతృప్తికరంగాలేదు. పేద కుటుంబాల పిల్లలు గరిష్ఠంగా అభివృద్ధి చెందాలంటే ప్రభుత్వ విద్యాలయాలను, ఇతర సౌకర్యాల నాణ్యతను పెంచాల్సిన అవసరం ఉంది.

ముఖ్యమైన బాలల హక్కులను ప్రచారం చేయాల్సిన అవసరం ఉంది. అప్పుడే బాలలు, వారి తల్లిదండ్రులు లేదా సంరక్షకులు బాలల హక్కులపై శ్రద్ధవహించి పని చేస్తారు. అవసరమైన వనరుల కేటాయింపుకై ప్రభుత్వం మీద ఒత్తిడి తీసుకొనిరాగలరు. మన జాతి ఉజ్వల భవిష్యత్‌కై అన్ని ప్రజా సంఘాలు, బాల సంఘాలు ఈ ముఖ్యమైన బాలల హక్కుల సాధనకై రాజీ పడకుండా కృషి చేయాలి.





# భూగోళాన్ని కాపాడుకుందాం

**భూ**మి మీద ఇళ్ళు, చెట్లు చేమలు, వాగులు వంకలు, చిన్న పెద్ద నదులు, గుట్టలు, పర్వతాలను చూస్తున్నాం. ఎటు చూసినా భూమి ఎత్తు పల్లాలతో నలుమూలలా కళ్ళకు అగుపడుతుంది. కాని, ఆకాశంలో చాలా పైకిపోయి భూమి వైపు చూస్తే భూమి గుండ్రంగా, పెద్ద బంతిలాగా అగుపడుతుంది. పైనుంచి కొద్దిగా కిందికి వచ్చి చూస్తే మిట్ట పల్లాలతో వాగులు వంకలతో, నదులు పారుతూ సముద్రంలో కలుస్తూ గుండ్రంగా భూమి అగుపడుతుంది. ఇలా భూమి గుండ్రంగా ఉండటంవలన భూమి, నీరు, పర్వతాలన్నిటిని కలిపి భూగోళంగా పిలుస్తున్నాం.




ఈ భూగోళం మీద ఎన్నో రకాల జంతువులు, చెట్లు లక్షల సంవత్సరాల నుండి నివసిస్తున్నాయి. వీనిలో బాగా అభివృద్ధి చెందిన మానవుడు, అంటే మనం, జంతువులలో భాగంగా నివసిస్తున్నాం. మన బాగోగులు భూగోళం బాగోగుల మీద ఆధారపడి ఉంటుంది. అందువల్ల మనం క్షేమంగా ఉండటానికి భూగోళాన్ని కాపాడుకోవాలి.

**భూగోళం చుట్టు ఉన్న వాతావరణంలో మార్పులు**

భూమి మీద ఉండే పర్వతాలపై ఎత్తుకు పోయేకొద్దీ చల్లబడుతుంది. పైకి పోయిన ప్రతి వెయ్యి మీటర్లకు ఆరు సెంటీగ్రేడ్ డిగ్రీల వేడి తగ్గుతుంది. ఇదే విధంగా భూమి లోపలకి పోయేకొద్దీ వేడి పెరుగుతుంది. మన దేశ ఉత్తర భాగంలో 8848 మీటర్ల ఎత్తు ఉండే హిమాలయ పర్వతాలనే తీసుకుందాం. ఈ పర్వత శిఖరం (పైభాగం) ఎప్పుడు మంచుతో కప్పబడి ఉంటుంది. ఈ మంచులో కింది భాగం నెమ్మదిగా కిందకు జరుగుతుంది. ఇలా మెల్ల మెల్లగా కదిలే మంచును 'గ్లేజియర్' అని అంటాం. ఈ గ్లేజియర్ కరిగి నీరుగా మారి, వరదగా ప్రవహిస్తుంది. ఇలా గంగా, యమున నదులు హిమాలయ పర్వతాల్లో పుట్టాయి. వేడి









పెరుగుతున్న కొద్దీ మంచు ఎక్కువగా కరిగి నీటి పారుదల పెరుగుతుంది. ఇదే విధంగా ధ్రువ ప్రాంతాలు ఎల్లప్పుడు మంచుతో కప్పబడి ఉంటాయి. వేడి పెరిగితే ఈ మంచు కూడా వేగంగా కరిగి నీరుగా మారుతుంది. ఈ నీరు నదుల ద్వారా చివరకు సముద్రంలో కలుస్తుంది. దీనివల్ల సముద్రం మట్టం పెరుగుతుంది.

భూగోళం మీద సూర్య కిరణాలు పడడంతో వేడి ఎక్కుతుంది. అదే చెట్లు చేమలు ఉంటే సూర్య కిరణాల వల్ల భూగోళం తొందరగా వేడి ఎక్కదు. మానవులు తమ అవసరం కోసం అడవుల్లో ఉన్న చెట్లను బాగా కొడుతున్నారు. అడవులు తరిగిపోతున్నాయి. ఫలితంగా భూమి మీద పడుతున్న సూర్య కిరణాల వల్ల భూగోళం త్వరగా వేడి ఎక్కుతుంది. ఇలా పెరిగిన వేడి భూమి మీద మంచును వేగంగా కరిగిస్తుంది. నీరుగా మారుతుంది. ఫలితంగా సముద్రపు నీటి మట్టం పెరుగుతుంది.

పరిశ్రమలో కాల్చే బొగ్గు, తిరిగే బస్సులు, రైళ్ళు, విమానాలు, ఇతర యంత్రాలు ఎంతో వేడిని వాతావరణంలోకి విడుదల చేస్తున్నాయి. ఇవి భూమి చుట్టు ఉండే వాతావరణంలోని ప్రాణ వాయువును తీసుకొని, వేడి, ఇతర కాలుష్య పదార్థాలను విడుదల చేస్తున్నాయి. ఇదే విధంగా మానవులు చేసే ఎన్నో కార్యక్రమాల వల్ల వాతావరణంలో క్రమంగా కార్బన్‌డై ఆక్సైడ్ అనే వాయువు పెరిగి భూమి మీద వేడిని పెంచుతుంది. ఈ మార్పులు అన్ని భూమి చుట్టు ఉన్న వాతావరణాన్ని మార్చి వేస్తున్నాయి. వాతావరణంలో కాలుష్యాన్ని పెంచుతున్నాయి.

ఇన్ని విధాలుగా భూమి మీద వేడి పెరగడంతో భూగోళం మీద ధ్రువ ప్రాంతాల్లో ఉన్న మంచు కరిగి నీరుగా మారుతుంది.


ధ్రువ ప్రాంతం మంచు



ఈ నీరు చివరకు సముద్రంలో కలుస్తుంది. అందువల్ల సముద్ర నీటి మట్టం పెరుగుతుంది. ఇలా పెరిగిన సముద్రపు నీటి మట్టం భూభాగాన్ని ముంచుతుంది. అంటే భూగోళం మీద వేడి పెరుగుతున్న కొద్ది మంచు కరగడం ద్వారా సముద్రంలో నీటి మట్టం పెరిగి భూభాగాన్ని ముంచి వేస్తుంది. ఇలా ఇప్పటికే ఎంతో విలువైన భూమి పెరుగుతున్న సముద్రపు నీటిలో మునిగిపోయింది. ఈ ప్రక్రియ కొనసాగు తున్నది. ఫలితంగా కొన్ని దేశాలే అగుపడకుండా మాయమయ్యే స్థితి ఏర్పడింది.

ఈ వాతావరణ మార్పుల వల్ల భూగోళం మీద తుఫాన్లు, వరదలు ఎన్నో రెట్లు పెరిగాయి. ఇంకా పెరుగుతున్నాయి. ఈ వరదలు మానవాళికి, జంతుజాలానికి, పంటలకు, చెట్లకు ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నాయి.

**భూగోళం వేడి పెరగడం వల్ల వచ్చే ఆరోగ్య సమస్యలు**

భూగోళం మీద వేడి పెరగడంవల్ల ఇప్పుడు భరించలేని వేడి గాలులు విస్తున్నాయి. దీనివల్ల ప్రతి సంవత్సరం ఎంతో మంది చనిపోతున్నారు. ఫలితంగా, పేద, అభివృద్ధి చెందుతున్న దేశాలలో పేద ప్రజలు ఎక్కువగా చనిపోతున్నారు. మనుషులకు, పశువులకు ఎన్నో కొత్త రకాల జబ్బులు వస్తున్నాయి. ఈ వేడిని


ఎప్పుడు మంచుతో ఉండే ఎవరెస్ట్ పర్వతం

తట్టుకోవడానికి పెట్టుకునే ఎయిర్ కండిషన్ యంత్రాలు మరింత వేడి సృష్టిస్తూ భూగోళం మీద వేడిని ఇంకా పెంచుతున్నాయి.

అందువల్ల మనమంతా క్షేమంగా, సంతోషంగా ఎక్కువ కాలం ఉండాలంటే భూగోళం చుట్టు వాతావరణం కాలుష్యం చెందకుండా, భూగోళం వేడి ఎక్కకుండా రక్షించుకోవాలి. దీనికై అడవులు నరకడాన్ని ఆపి వేయాలి. ఒకవేళ అవసరం కొద్ది చెట్లను నరికితే వెంటనే కొత్త చెట్లను నాటి పెంచాలి. విలున్నచోటల్లా చెట్లను పెంచాలి. కాలుష్యాన్ని పెంచే బొగ్గు, ముడిచమురు, ఫ్యాక్టరీలు, యంత్రాల వినియోగంలో పొదుపు పాటించాలి. వాతావరణంలో కాలుష్యాన్ని పెంచే రసాయనిక వాడకాల్ని పూర్తిగా ఆపివేయాలి. లేదా బాగా తగ్గించాలి.

భూగోళాన్ని వాతావరణ కాలుష్యానుండి కాపాడటం మన అవసరం. భూగోళ క్షేమమే మన క్షేమం. రండి! భూగోళాన్ని కాలుష్యానుండి కాపాడుదాం!!



# శ్రమ : 6. శ్రమ విభజన-
# వివిధ వృత్తులు, కులాల ప్రారంభం



**మా**నవ జీవితానికి మూలం శ్రమేనని తెలుసుకున్నాం కదా. అయితే నిత్య జీవితంలో అందరూ ఒకే విధమైన పని చేయడంలేదు. వారి వారి వృత్తులను బట్టి చేసే శ్రమ స్వభావం మారుతుంది. దీనికి ప్రధాన కారణం శ్రమ విభజనే. అంటే తమ తమ పరిస్థితులకు అనుగుణంగా, తమ అభివృద్ధి అవకాశాలను దృష్టిలో పెట్టుకొని ప్రతి ఒక్కరు ఏదో ఒక పనిని చేస్తున్నారు. దీనినే శ్రమ విభజన అని అంటున్నాం. శ్రమ విభజన వల్ల శ్రమ ఫలితం, అంటే శ్రమ సామర్థ్యం పెరుగుతుంది. అభివృద్ధి జరుగుతున్న కొద్దీ, శ్రమ విభజన క్లిష్టంగా మారుతుంది. నైపుణ్యం పెరుగుతుంది. దీనికై ప్రత్యేక శిక్షణ, కృషి అవసరం. ఇవే నేటి సమాజానికి మూలంగా కొనసాగుతున్నాయి.

మానవ అభివృద్ధి చరిత్రలో శ్రమ విభజన ఆదిమ మానవులతోనే ప్రారంభమైంది. మొదట ఆడ, మొగలతో ప్రారంభమైన శ్రమ విభజన క్రమంగా విస్తరిస్తూ కుటుంబ శ్రమ విభజనకు, కొన్ని కుటుంబ సమూహాల శ్రమ విభజనకు దారి తీసింది. ఈ శ్రమ విభజనే వివిధ వృత్తులుగా మారింది.

మొదట, సంచార జీవితంలో కలిసి వేటాడి వచ్చిన ఫలాన్ని అందరూ అనుభవించేవారు. సంచార జీవితం నుండి స్థిరనివాసాలు ఏర్పచుకొన్న ప్రక్రియలో స్త్రీ, పురుషుల మధ్య శ్రమ విభజన జరిగిందని



నిపుణులు భావిస్తున్నారు. కొన్ని ప్రకృతి ధర్మాల వల్ల స్త్రీలు సహజంగా అన్ని రోజులు బయటికి వెళ్ళి వేటలో పాల్గొనలేక పోయేవారు. అదే పురుషునికి ఏ ఆటంకం లేకుండా అన్ని రోజులు వేటలో పాల్గొనే స్థితిలో ఉండేవారు. దీనికి అనుగుణంగానే స్త్రీలు ఇంట్లో పనులు చేయడానికి ప్రాధాన్యత ఇచ్చేవారు. పురుషులు బయటికి వెళ్ళి వేటలో పాల్గొనటానికి, ఆహారాన్ని సేకరించడానికి ప్రాధాన్యతను ఇచ్చేవారు. ఇలా ప్రారంభమైన స్త్రీ, పురుషుల శ్రమ విభజన క్రమంగా విస్తరించింది.

రెండవ దశలో అవకాశాలు, పరిసరాల కారణంగా శ్రమ విభజన జరిగింది. ఒకొక్క గుంపులో కొంత మంది ఆహార సేకరణకు ప్రాధాన్యతను ఇస్తే, ఇంక కొంత మంది గుంపు రక్షణకు బాధ్యత వహించే వారు. మట్టి పాత్రల తయారీ, కంచు, ఇనుము పాత్రల తయారీ మొదలు పెట్టిన తరువాత కొంత మంది మట్టి పాత్రల తయారీలో, ఇంక కొంత మంది కంచు, ఇనుము పనిముట్ల తయారీలో ప్రావీణ్యం సంపాదించారు. దాదాపు ఇదే దశలో కొంత మంది కర్రలతో పని ముట్లు చేసేవారు. మరి కొంత మంది బట్టలు నేయటంలో, కుట్టటంలో ప్రావీణ్యం సంపాదించారు. ఇలా ప్రారంభమైన శ్రమ విభజన వివిధ గ్రామీణ వృత్తులకు దారి తీసింది. నేడు మనం చూస్తున్న వడ్రంగి, కుమ్మరి, కమ్మరి, చేనేత వృత్తులు ఇలా ప్రారంభమైనవే.



గుంపు యాజమాన్య రక్షణలో పాల్గొన్న వారు సైనిక శిక్షణ తీసుకొని సామాజిక పరిపాలనలో ప్రావీణ్యత సంపాదించారు. ఇది సైనిక వృత్తికి దారి తీసింది. క్రమంగా గుంపు రక్షణలో పాల్గొన్న వారు పరిపాలనకు అలవాటు బడ్డారు. క్రమంగా ఈ పాలకులే నాయకులుగా, విస్తారమైన భూభాగాలను జయించి, చిన్న, పెద్ద రాజులుగా రూపొందారు. ఇలా స్థిరనివాసం ఏర్పుచుకున్న గుంపులో చదివి రాయగలవారు పాలనలో చురుకుగా పాల్గొని పాలకులుగా మారారు. ఈ మార్పులన్నిట్లో శ్రమ విభజనే కీలకం. ఇలా శ్రమ విభజన ద్వారా పశువుల కాపర్లు, తోలు పని, రైతులు, కుమ్మరి (కుండలు చేసేవారు), సాలె (బట్టలు నేసేవాళ్ళు), దర్జీ (బట్టలు కుట్టేవారు), చాకలి (బట్టలు ఉతికి శుభ్రం చేసేవాళ్ళు), మంగలి వృత్తులు ఏర్పడ్డాయి. క్రమంగా ఈ వృత్తులే వివిధ కులాలు ఏర్పడడానికి దారి తీశాయి. వీరంతా శ్రమ చేసేవారే. వీరందరూ శ్రామికులే. ఈ శ్రామికుల విభజనే మన దేశంలో వివిధ కులాల రూపంలో స్థిరపడింది.

క్రీస్తుపూర్వం 17,18వ శతాబ్దం తరువాత, ముఖ్యంగా పారిశ్రామిక విప్లవం తరువాత, పెట్టుబడిదారి వ్యవస్థ అభివృద్ధి చెందుతున్న కొద్ది, పశ్చిమ దేశాలలో కుల వ్యవస్థ అంతరించి పోయింది. మన దేశంలో కొన్ని కారణాల వల్ల ఈ కుల వ్యవస్థ బలంగా కొనసాగుతుంది. పెట్టుబడిదారి వ్యవస్థ బలపడుతున్నప్పటికి కుల సంబంధాలు అదే మేరలో బలహీన పడడటంలేదు. దీనికి గల కారణాలను బాలలు పెద్దైన తరువాత తెలుసుకోవచ్చు. 

# ప్రపంచ బాలకార్మిక వ్యతిరేక దినోత్సవం



ఆడుతూ పాడుతూ బడిలో చదువుకోవాల్సిన వయస్సులో ఎంతో మంది బాలలు తమ జీవనాన్ని గడపడానికి లేదా కుటుంబ జీవనానికి ఆదాయాన్ని పెంచుకోడానికి బాలకార్మికులుగా పని చేయాల్సిన దుస్థితి కొనసాగుతుంది. ఇది ఎంతో ఆందోళన కలిగిస్తుంది. అంతర్జాతీయంగా, మన దేశంలో బాలకార్మిక వ్యవస్థను రద్దు చేస్తూ ఎన్నో చట్టాలు చేయబడ్డాయి. కొంత ప్రయత్నం కూడా జరుగుతుంది. అయినా బాలకార్మిక వ్యవస్థ కొనసాగుతూనే ఉంది. ఈ బాలకార్మిక వ్యవస్థ మానవ జాతికి మాయని మచ్చ. మన అభివృద్ధికి ఎంతో ఆటంకం. అందువల్ల మన జాతి సంపద బాలలను అభివృద్ధి పరచడానికి బాల కార్మిక వ్యవస్థ నిర్మూలన చట్టాలను కఠినంగా అమలు చేయాల్సిన అవసరం ఉంది. బాలకార్మికులను పెట్టుకునే వారు ఎంత పెద్ద వారు అయినప్పటికి వారిపై కఠిమైన చర్యలు తీసుకోవాలి. ఈ సమస్య ప్రాధాన్యతను అన్ని దేశాల ప్రజలకు గుర్తింపజేయడానికి అంతర్జాతీయ కార్మిక సంస్థ ప్రతి సంవత్సరం జూన్ 12న " ప్రపంచ బాలకార్మిక వ్యతిరేక దినంగా జరపాలని 2002లో నిర్ణయించింది. ఇదే విధంగా 2003లో అక్రమ పిల్లల రవాణాపై కేంద్రీకరించి కఠినమైన చర్యలు తీసుకునేందుకు కూడా నిర్ణయించింది. ఈ బాలల అక్రమ రవాణా పెద్ద ఎత్తున కొనసాగుతుంది. అభివృద్ధి చెందుతున్న దేశాల్లో కూడా బాలల అక్రమ రవాణా కొనసాగుతుంది. అన్ని దేశాలలో కలిపి దాదాపు 24.6 కోట్ల మంది బాలకార్మికులు ఉన్నట్లు అంచనాలు తెలుపుతున్నాయి. మన దేశంలో కూడా



బాలకార్మికులు పెద్ద ఎత్తున పని చేస్తున్నారు.

సరళీకరణ, ప్రపంచీకరణ విధానాలు ప్రారంభించిన తరువాత పని కోసం గ్రామాలను, ఇళ్ళను వదిలిపెట్టి బతకడానికి పట్టణ ప్రాంతాలకు పేదలు తరలి పోతున్నారు. ఇలా పోతున్న వారిని 'వలస' కార్మికులు అని పిలుస్తున్నారు. ఫలితంగా వీరి పిల్లలు కూడా తల్లిదండ్రులతోపాటు వలస పోతున్నారు. వీరు బడికి పోకుండా తల్లిదండ్రులు పని చేసే చోటనే ఉంటూ బాల్యాన్ని గడుపుతున్నారు. కొద్దిగా పెద్దైన పిల్లలు పని కూడా చేస్తున్నారు. ఇట్టి బాలలను కూడా బడికి పంపి చదవించడానికి



ప్రత్యేకమైన ఏర్పాట్లు చేయాల్సిన అవసరం ఉంది.

**ఆంధ్రప్రదేశ్‌లో బాల కార్మికుల నిర్మూలనకై చేస్తున్న ప్రయత్నాలు**

ఆంధ్రప్రదేశ్‌లో బాల కార్మికులు లక్షల సంఖ్యలో కొనసాగుతున్నారు. ఇళ్ళల్లో, చిన్న చిన్న హోటళ్ళలో, వివిధ పరిశ్రమల్లో బాలకార్మికులు పని చేస్తున్నారు. ఎన్నో స్వచ్ఛంద సంస్థలు బాలకార్మిక వ్యవస్థను నిర్మూలించడానికి పని చేస్తున్నాయి. అయినా బాలకార్మికుల సమస్య తీవ్రంగానే కొనసాగుతున్నది తప్ప తగ్గడం లేదు. ఇటీవల హైదరాబాద్ లాంటి పట్టణాలలో ఇళ్ళల్లో పని చేసే బాల కార్మికులను విడిపించడం జరిగింది.



# ప్రపంచ పర్యావరణ దినోత్సవం

కాలుష్యం ద్వారా భూగోళం చుట్టు ఉన్న వాతావరణ మారి భూగోళాన్ని వేడి చేస్తున్నాయి. ఈ పెరుగుతున్న వేడి ధ్రువ ప్రాంతాల్లో ఉన్న మంచును, ఎత్తైన పర్వతాల మీద ఉన్న మంచును, గ్లేజియర్స్‌ను వేగంగా కరిగిస్తూ భూగోళ వాతావరణంలో ఎన్నో మార్పులను తెస్తున్నాయి. సముద్ర మట్టాన్ని పెంచి ఎంతో నష్టాన్ని కలిగిస్తున్నాయి. భవిష్యత్‌లో ఈ నష్టాలు పెరిగి భూగోళ భద్రతకే ప్రమాదం పొంచి వుంది. ఈ దుష్ప్రభావాల్ని గమనంలో ఉంచుకొని ఐక్యరాజ్య సమితికి చెందిన పర్యావరణ కమిటీ ప్రతి సంవత్సరం జూన్ 5న 'ప్రపంచ పర్యావరణ పరిరక్షణ' దినంగా జరపాలని నిర్ణయించింది. కనీసం ఈ రోజున భూగోళ భద్రతకు వాతావరణ కాలుష్యం ద్వారా వచ్చే ప్రమాదాల్ని ప్రజలందరికి జ్ఞప్తికి చేయాలని ఇలా నిర్ణయించబడింది. మానవాళి క్షేమం దృష్ట్యా భూగోళ వాతావరణాన్ని కాలుష్య రహితంగా ఉంచి భూగోళాన్ని పరిరక్షించాల్సిన అవసరాన్ని కూడా ప్రజలకు జ్ఞాపకం చేయడం కోసం కూడా ఈ రోజు ఉద్దేశించబడింది. మరి మనం కూడా పొదుపుగా బొగ్గు, విద్యుత్తు, వివిధ యంత్రాలను వాడుతూ, చెట్లలను పెంచుతూ భూగోళ వాతావరణాన్ని, భూగోళాన్ని రక్షిద్దామా?



# బాలల హక్కులు

**మా**నవ హక్కులలో భాగంగా బాలల హక్కుల పరిరక్షణకై ఐక్యరాజ్య సమితికి బాలలకు హక్కులను గుర్తిస్తూ 1989లో ఒక తీర్మానాన్ని ఆమోదించింది. 1990లో ఇది చట్టంగా మారింది. దీన్ని అమలు చేయడానికి దాదాపు 180 దేశాలు అంగీకరించాయి. మన దేశం కూడా అంగీకరించింది. ఈ హక్కుల్లో హక్కుల అమలు బాధ్యత, విద్యకు సంబంధించిన హక్కులు ప్రస్తుత పరిస్థితిల్లో అతి ప్రాధాన్యతవహిస్తున్నాయి. క్లుప్తంగా వీనికి సంబంధించిన బాధ్యతలు ఆర్టికల్-18, ఆర్టికల్-29లో నిర్వచించబడ్డాయి. సంక్షిప్తరూపంలో ఇవి కింద ఇవ్వబడ్డాయి.

## ఆర్టికల్-18

**1.** పిల్లల పెంపకం, అభివృద్ధి తల్లిదండ్రులు ఉభయుల ఉమ్మడి బాధ్యత అనే సూత్రాన్ని గుర్తించే విధంగా భాగస్వామ్య దేశాలు శాయాశక్తులా కృషి చేయాలి. తల్లిదండ్రులు లేదా సంరక్షకులు బాలల పెంపకం, అభివృద్ధికి ప్రాథమిక బాధ్యత కలిగి ఉంటారు. బాలలను అత్యంత ప్రయోజనకరమైన విధంగా పెంచడమే వారి మౌలిక బాధ్యతగా ఉండాలి.

**2.** ప్రస్తుత సదస్సు రూపొందించిన హక్కులకు గ్యారెంటీ కలిపించి, ముందుకు తీసుకుపోవడంలో భాగస్వామ్య దేశాలు తోడ్పాటును ఇవ్వాలి. బాలల పెంపక బాధ్యతల నిర్వహణలో తల్లిదండ్రులకు లేదా సంరక్షణకు తగు సహాయం అందజేయాలి. బాలల సంరక్షణకు సంబంధించిన సంస్థలు, సదుపాయాలు, సేవలను పెంపొందించేందుకు శ్రద్ధవహించాలి.

**3.** పని చేసే తల్లిదండ్రుల సంతానానికి శిశుసంరక్షణ సేవలు, సదుపాయాలు లభించే విధంగా భాగస్వామ్య దేశాలు తగు చర్యలు తీసుకోవాలి.

## ఆర్టికల్ - 29

**1.** బాలల విద్యను క్రింది విధంగా నిర్దేశించబడాలని భాగస్వామ్య దేశాలు అంగీకారాన్ని ప్రకటిస్తున్నాయిః

**ఏ)** బాలల వ్యక్తిత్వం, ప్రతిభ శారీరక మేధాపరమైన సామర్థ్యాలు గరిష్ట స్థాయిలో పెంపొందించడం.

**బి)** మానవ హక్కులు, ప్రాథమిక స్వేచ్ఛలపట్ల, ఐరాస చార్టర్‌లో పొందుపర్చబడిన సూత్రాలపట్ల గౌరవాన్ని పెంపొందించడం.

**సి)** బాలల తల్లిదండ్రుల పట్ల, ఆమె లేదా అతని సాంస్కృతిక అస్తిత్వంపట్ల, భాషా విలువల పట్ల బాలలు జీవించే దేశం యొక్క జాతీయ విలువల పట్ల అతను లేదా ఆమె పుట్టిన దేశపు విలువల పట్ల ఆమె లేదా అతని స్వీయ నాగరికతకు భిన్నమైన వాటి పట్ల గౌరవం పెంపొందించడం.

**డి)** స్వేచ్ఛా సమాజంలో బాధ్యతయుతంగా జీవించేందుకు బాలలను సన్నద్ధం చేయడం సదావగాహన, శాంతి సహనం లైంగిక సమానత్వం వివిధ ఉప జాతులు, మతబృందాల ప్రజలందరి మధ్య భిన్న జాతులకు చెందిన వ్యక్తుల మధ్య స్నేహభావన పెంపొందించడం.

**ఇ)** ప్రకృతి, పర్యావరణం పట్ల గౌరవం పెంపొందించడం.







# "విజయం"

- లక్ష్మణరావు

" పెద్దలు పనికి-పిల్లలు బడికి"
" పిల్లలతో పని చేయించడం నేరం"
" బాలకార్మిక వ్యవస్థ నశించాలి"
" బాలలతో పని చేయిస్తే శిక్షలు తప్పవు"

అంటూ హోరెత్తిన నినాదాలతో మెయిన్ రోడ్డులో భారీ ఉరేగింపులో పెద్దలు, పిల్లలు వెళుతున్నారు. ఉరేగింపు దగ్గరకొచ్చే కొద్దీ వాళ్ళు చేస్తున్న నినాదాలు స్పష్టంగా, గట్టిగా విన్పిస్తున్నాయి.

ఒక్కసారిగా కళ్ళు పెద్దవి చేసుకొని, చెవులు నిక్కరించి ఆ నినాదాలను వింటున్నాడు రాజు. కడుగుతున్న ప్లేట్లు, టీ కప్పులు పక్కన పడేశాడు. ఆ నినాదాలు తమలాంటి వాళ్ళని కాపాడడంకోసమేనని అర్థం చేసుకున్నాడు. చేస్తున్న పనిని వదిలిపెట్టి, ఒక్క ఉదుటున లేచి పరుగు పరుగున ఉరేగింపులో కలసిపోయి వాళ్ళతో గొంతు కలిపాడు. అలా అలా ఒక కిలో మీటరు దూరం ఆశగా, ఆవేశంగా, ఆనందంగా అరుస్తూ నడుస్తున్నాడు. ఆక్షణంలో వీపు మీద చెళ్ళున ఒక్క దెబ్బ పడింది. ఆ దెబ్బకు ఉలిక్కిపడిన రాజు వెనక్కి తిరిగి చూసి నిలువెల్లా వణికిపోయాడు. తన యజమాని రాక్షసుడిలా అరుస్తూ జుట్టు పట్టి వెనక్కి లాగేశాడు.

"ఏరా! పూటకి గతిలేనోడివి. నీకు పోరాటాలు కావాలా? చంపేస్తా! నువ్విలా వచ్చేస్తే ఆ ప్లేట్లూ, కప్పులూ ఎవడు కడుగుతాడ్రా? నీ బాబు వచ్చి కడుగుతాడా? కాళ్ళు విరగ్గొడతా పదా!"



రాజుకు వొళ్ళంతా చెమటలు పట్టేశాయి. ఈ రోజు దెబ్బలూ తప్పవు. "మామూలుగానే ఈ దెబ్బలు తప్పడంలేదు" అని మనసులోనే అనుకుంటూ, భయపడుతూ హోటల్‌వైపు పరుగు తీశాడు.

రాత్రి 11 గం.లు హోటల్‌లో మిగిలిపోయిన ఇడ్లీలు, సాంబారు కట్టిన పొట్లం విప్పుతుండగా, రాజు స్నేహితులు గణేష్, శ్రీను అక్కడకి వచ్చారు.

ప్రతి రోజూ పని ముగించుకుని రాత్రికి బస్టాండులో ఉన్న ప్లాట్‌ఫాంకు చేరతారు.

గణేష్ మెకానిక్ షెడ్‌లోనూ, శ్రీను కిరాణా షాపులోనూ పని చేస్తున్నారు. ముగ్గురూ 14 సంవత్సరాల వయసులోపు పిల్లలే.



స్నేహితులిద్దర్నీ చూడగానే రాజు ఏడుస్తూ ఆరోజు జరిగిన విషయాలన్నీ చెప్పాడు. "పిల్లలతో పని చేయించడం నేరమనీ, దానికి శిక్షలున్నాయని చెబుతున్నా వీళ్ళు మనతో పనులెందుకు చేయిస్తున్నారు?" అని వాపోయాడు.

"అడిగే వాళ్ళు లేరురా" నిరుత్సాహంగా అన్నాడు గణేష్.ఆ మాటకి శ్రీను కల్పించుకుని, "ఎందుకు లేరూ? అధికారులు ఉన్నారు. కానీ, వాళ్ళు మనం పని చేసే చోటుకి వచ్చి వివరాలు అడగబోతే మనల్ని లోపల దాచేస్తున్నారు. లేకపోతే మన అసలు వయసును దాచిపెట్టి 15 సం॥లు అని చెప్పమంటున్నారు".

"అలాంటపుడు అధికారులకు మనం నిజం చెప్పేస్తే మనల్ని ఇక్కణ్నించి తీసుకెళ్ళి చదివిస్తారు కదా!" ఆశగా అన్నాడు రాజు.

గణేష్ నవ్వుతూ "ఒరేయ్ నిజం చెబితే మనల్ని బతకనిస్తారా?"

ఈ ముగ్గురూ ఇలా మాట్లాడు కుంటున్న సమయంలో అక్కడే డ్యూటీలో ఉన్న కానిస్టేబుల్ అటుగా వచ్చి "ఒరేయ్ ఈటైంలో ఇక్కడేం చేస్తున్నార్రా? నిద్రపోయే వాళ్ళ దగ్గర వస్తువులు కొట్టేయడానికి వచ్చారా? ఎవర్రామీరు? ఏవూరు మీది?" గద్దించాడు.

"లేదుసార్! వేం దొంగలం కాదు. వీడు హోటల్‌లో, వీడు కిరాణాషాపులో, నేనేమో మెకానిక్ షెడ్డులో పనులు చేసుకుంటున్నాం" సార్ అన్నాడు గణేష్.

"అవునా! పని అయిపోతే ఇంటికి పోవాలిగానీ, ఇక్కడెందుకున్నారు?" అడిగాడు కానిస్టేబుల్ః

"అది కాదు సార్, ఇంటికి పోవాలంటే ఇప్పుడు బస్సుల్లేవుసార్, మళ్ళా ఉదయాన్నే పనికి రావాలి. అందుకే రోజూ ఇక్కడే పడుకుంటున్నాం సార్". బ్రతిమలాడుతున్నట్లు అన్నాడు రాజు.

కానిస్టేబుల్‌కి జాలివేసింది. "ఇంత చిన్నవయసులో చదువుకోవాలిగానీ, పని చేస్తారా?"



"ఏం చెయ్యాలిసార్, మావాళ్ళు మమ్మల్ని చదువు మాన్పించి పనిలో పెట్టారు." దీనంగా అన్నారు.

కానిస్టేబుల్ మౌనంగా వింటున్నారు.

"సార్! పిల్లలతో పని చేయించడం నేరంకదూ!'' రాజు వేసిన ప్రశ్నకు కానిస్టేబుల్ ఉలిక్కిపడ్డాడు.

"సార్! అలా పని చేయించే వాళ్ళని జైల్లో పెట్టండి సార్ మమ్మల్ని చదివించమని చెప్పండి సార్."

ముగ్గురూ తమ బాధలను కానిస్టేబుల్‌కి చెబుతూనే ఉన్నారు. పెద్దవాళ్ళు ఎంత తప్పు చేస్తున్నారో అర్థం చేసుకున్న కానిస్టేబుల్, "బాబూ! మీ బాధ నాకర్థమైంది. ఈ పక్కనే మన తహసీల్‌దార్ గారున్నారు. ఆయన చాలా మంచివారు. బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన గురించి చాలా కృషి చేస్తున్నారు. రేపు ఉదయాన్నే ఆయన్ని కలవండి, నేను కూడా మాట్లాడతాను సరేనా!". "సరేసార్". ముగ్గురూ హాయిగా ఊపిరి పీల్చుకున్నారు. ఈ నరకం నుంచి తప్పించుకునే మార్గం దొరికినందుకు సంతోషంగా చిన్న కునుకు తీశారు.



తెల్లవారింది. ముగ్గురికి పనిలోకి వెళ్ళాలన్న ఆలోచన రాలేదు. యజమానులు కొడతారేమోనన్న భయం కూడా రాలేదు. ఒక్కటే ఆలోచన. బాలలు పనులలోంచి బయటకు రావాలి. బడిలో చేరాలి. అందరిలా చదువుకోవాలి. అదే ఆలోచనతో తహసీల్‌దార్ ఇంటివైపు కదిలారు. అక్కడక్కడా అడ్రస్ అడుగుతూ తహసీల్‌దార్ గారి ఇల్లు చేరుకున్నారు రాజు. గణేష్, శ్రీను.

గేటు లోపల ఉన్న సీమ కుక్క పిల్ల వీళ్ళను చూసి అరవడం మొదలు పెట్టింది.

"ఒరేయ్ కరుస్తుందేమో" భయంగా శ్రీను. "కట్టేసి ఉందిలే" ధైర్యం చెప్పాడు రాజు. "ఒరేయ్ ఏదీ దాచకుండా మన బాధలన్నీ చెబుదాం!" గణేష్ మాటల్లో ఆత్మశ్వాసం.

"ఎవరా పిల్లలు?" కళ్ళజోడు సరి చేసుకుంటూ గేటు దగ్గరకు వచ్చారు తహసీల్‌దారు గారు.

''సార్! మేము... మేము..."

పిల్లల వాలకాన్ని బట్టి ఇట్టే గుర్తుపట్టారు తహసీల్‌దార్. ''ఏం బాబూ ఏవన్నా మాట్లాడాలా?"

" అవును సార్! ముందు మమ్మల్ని లోపలికి రానియ్యండిసార్'' రాజు ప్రాధేయంగా అన్నాడు.

"రండి" గేటు తీసి సాదరంగా ఆహ్వానించారు తహసీల్‌దార్. ఎలా మొదలు పెట్టాలి? నువ్వంటే నువ్వని గుసగుసలాడు కుంటుండగా గమనించిన తహసీల్‌దార్ "ఏం బాబూ ఏదో మాట్లాడాలని అన్నారు? భయంలేదు చెప్పండి....". "సరే నేనే చెబుతా మీరెందుకు వచ్చారో.... చెప్పనా?" ముగ్గురి మౌనం కొనసాగింది.

"మీకు చదువుకోవాలని ఉంది....

మీ వాళ్ళు మిమ్మల్ని పనిలో పెట్టారు.... యజమానులు మిమ్మల్ని కొట్టి, తిట్టి హింసిస్తున్నారు..... మిమ్మల్ని బడికి వెళ్ళనీయడంలేదు. అవునా.



తహసీల్దారు గారి మాటలకు ముగ్గురికీ దుఃఖం పొంగుకొచ్చింది. కళ్ళలో నీళ్ళ సుడులు తిరుగుతున్నాయి. అమాంతం ఏడ్చుకుంటూ తహసీల్దారు గారిని చుట్టేశారు పిల్లలు. పండ్ల బిగువున ఎంత ఆపుకున్నా ఆగని దుఃఖం నాలుగైదు నిమిషాలు కొనసాగింది. ఆ తరువాత నిశ్శబ్దం. ఏం జరుగుతోంది? అందరిలోనూ ప్రశ్న. ఆలంబన ఆప్యాయతలు కలిస్తే మాటలు మూగబోతాయి. దానికి సాక్ష్యం ఈ సంఘటన.

తహసీల్దారు గట్టిగా నిట్టూర్చి పిల్లలను ఓదారుస్తూ, "చూడండి! బాలకార్మిక వ్యవస్థ నిర్మూలనకు ఎంతో ప్రయత్నం, చట్టాలు చేశాం. ఉల్లంఘించిన వారికి 3 నెలల జైలు శిక్ష. 20 వేలు జరిమానా విధిస్తున్నామని చెబుతున్నాం. అయినా మీలాంటి బాల కార్మికులు ఇంకా కొనసాగుతున్నారు".

"మీరే కాదు మీలా పని చేస్తున్న పిల్లలు ఎక్కడెక్కడ ఉన్నారో, ఎలాంటి పనులలో ఉన్నారో మాకంటే ఎక్కువగా మీరే చెప్పగలరు. చెప్పండి. అందరికి సహాయాన్ని చేస్తాను".

" ఈ బాలకార్మిక వ్యవస్థ నిర్మూలన జరగాలంటే మేము, పోలీసు, న్యాయ వ్యవస్థలతోపాటు స్థానిక ప్రజలు కూడా సహకరించాలి. మీరు భయపడవలసిన అవసరంలేదు. మిమ్మల్ని పనిలో పెట్టుకున్న వారికి తగిన బుద్ధి చెబుతాను. మిమ్మల్ని చదివించమని మీ తల్లి తండ్రులకు చెప్పి బడిలో చేర్పిస్తాను.

"న్యాయం కోసం చట్టాలను ఎలా ఉపయోగించుకోవాలో, ఎవరి ద్వారా సహాయం పొందాలో, మీలాంటి బాలలందరూ తెలుసుకోవాలి. ఏమైతేనేం ఇవేమీ తెలియకుండానే చదువుపట్ల ఆసక్తితో బాలకార్మిక వ్యవస్థ నుండి బయటకు వచ్చి మీరు విజయం సాధించారు. ఇది వేల, లక్షల మంది బాలబాలికలకు స్ఫూర్తికావాలి. పదండి బడికి వెళ్దాం". తహసీల్దారుతో ఆముగ్గురూ....



## బోల్‌తే

ఫత్తర్ కో బోల్‌తే
బండ
ఖేండీ కో బోల్‌తే
బెండ-
చావల్‌కో బోల్‌తే
బియ్యం
కిర్‌కిరికు బోల్‌తే
కయ్యం!

- విప్లవ్ దత్ శుక్లా



మానవ అభివృద్ధిలో

# మైలురాళ్ళు.. 7. కాగితం తయారీ

- వికాస్



కాగితం, అంటే పేపర్, వాడకం ఈ రోజు మన నిత్యజీవితంలో ఒక భాగమైంది. అచ్చు వేసిన పుస్తకాలను, వార్తా పత్రికలను, ఇతర పత్రికలను చదువుతున్నాం. రాయడానికి పేపర్లను వాడుతున్నాం. రకరకాల పేపర్లను వాడుతున్నాం. రాయడానికి ఒక రకమైన పేపరు, ముద్రించడానికి ఎన్నో రకాల పేపర్లను వాడుతున్నాం. ముఖ్యంగా ఎవైనా శుభాకార్యాలకు అందంగా ముద్రించడానికి అందమైన ప్రత్యేక కాగితంమీద ఆహ్వాన పత్రాలను పంపుతున్నాం. చివరికి, మనం రోజు వాడే రూపాయి నోట్లు కూడా ప్రత్యేకమైన పేపర్‌తో తయారు చేసినవే.

కంప్యూటర్లు రాక మునపు పేపర్ వాడకంలేని ఆధునిక జీవితం ఊహలోనైనా సాధ్యం కాకపోయేది. తలసరి పేపర్ వాడకాన్ని అభివృద్ధికి కొలమానంగా వాడేవారు. కంప్యూటర్ వాడకం పెరుగుతున్న కొద్ది పేపర్ వాడకం కనీస స్థాయికి దిగుతుంది. మన దేశంలో పేపరు వాడకం ఇంకా అధిక స్థాయిలోనే కొనసాగుతుంది. అతి కొద్దిమందే కంప్యూటర్లను వాడుచున్నారు. మొత్తం మీద మానవ అభివృద్ధి చరిత్రను గమనిస్తే, పేపర్ వాడకం ఆధునిక మానవుని అభివృద్ధిలో ఎంతో కీలక పాత్ర వహించింది.



ఇంత ప్రాముఖ్యత వహించిన పేపరు కనుగొనబడిన తీరు చాలా ఆసక్తికరమైంది.

క్రీస్తుపూర్వం సుమారు4 వేల సంవత్సరాల క్రితం ఈజిప్టు దేశంలో మొదట పేపరు తయారు చేయబడింది. నైలు నది గట్టు దగ్గర వరుసగా 'పాపిరస్'అనే చెట్లు విరివిగా పెరిగాయి. పాపిరస్ అంటే ఈజిప్ట్ భాషలో 'ఇంటికి సంబంధించింది'. ఇంగ్లీష్‌లో పాపిరస్ పదాన్ని పేపరుగా మార్చి వాడుతున్నాం. పాపిరస్ చెట్టు పది అడుగుల వరకు పెరుగుతుంది. తేలికగా, దృఢంగా ఈ చెట్టు కాండం ఉంటుంది. పై చర్మం వలిచిన తరువాత లోపల కర్రను చిన్న చిన్న ముక్కలుగా చేసేవారు. ఈ ముక్కలను మొదట నీటిలో నానబెట్టినతరువాత ఒక చెక్క పక్కన ఇంకొక చెక్కను ఒకదాని పక్కన ఇంకొక దాన్ని అంచులు కలిసేలా పరిచేవారు. ఆ తరువాత మొదట వరుసకు అడ్డంగా రెండవ వరుసను పరిచేవారు. ఇలా పరిచిన రెండు వరుసలను గట్టిగా అదిమి ఎండబెట్టేవారు. ఈ విధంగా 'పాపిరస్ పేపరు' తయారు చేసేవారు.



పాపిరస్ మొక్క

ఇలా కొత్తగా తయారు చేసిన పేపరు అప్పటికే రాయడానికి వాడుకలో ఉన్న 'బంకమన్ను టాబ్లెట్ల' కన్న ఎంతో సౌకర్యంగా ఉండేది. తేలికగా, గట్టిగా ఒక చోట నుండి ఇంకొకచోటికి తీసుకొని పోవడానికి సులువుగా ఉండేది. అందువల్ల పాపిరస్ పేపర్ల వాడకం చాలా వేగంగా విస్తరించింది. ఈ పేపరును ఉపయోగించి అధికార పత్రాలను, ఇతర పుస్తకాలను తయారు చేసేవారు. దాదాపు క్రీస్తు తరువాత 1000 సంవత్సరాల వరకు పాపిరస్ పేపరు వాడకం ప్రాధాన్యత వహించింది. ఈ పేపర్లను ఉపయోగించి పుస్తకాలు కూడా తయారు చేసే వారు.

ఆ తరువాత క్రీస్తుపూర్వం 105 సంవత్సరంలో చైనాలో ఈనాటి ఆధునిక పేపరుతో పోల్చగల పేపరు తయారీ చెట్టు గుజ్జు నుండి ప్రారంభమైంది. మొదట పట్టు పురుగుల పెంపకంలో వచ్చిన చెట్ల మొద్దుల నుండి ఈ పేపరును తయారు చేసేవారు. ఆ తరువాత ఇతర చెట్ల కలప నుండి వచ్చిన గుజ్జుతో ఆధునిక పేపరు తయారు చేయడం ప్రారంభమైంది. మన దేశంలో ఎన్నో రకాల చెట్ల కలప గుజ్జు నుండి పేపర్లను తయారు చేస్తున్నారు. చెరుకు పిప్పి నుండి కూడా పేపర్లను తయారు చేశారు.

ఏది ఏమైనప్పటికి పేపరు వాడకం నేడు మన జీవితంలో అత్యంత ప్రాధాన్యత వహిస్తుంది. ఆధునిక మానవుని అభివృద్ధిలో పేపరు వాడకం నేటికి ఎంతో ప్రాధాన్యతను కలిగిఉంది. తలసరి పేపరు వాడకం మానవ అభివృద్ధికి సూచికగా మారింది. 

# తిమ్మప్ప తమాషాలు!! 5

# వడిసెల రాయి



- శాఖమూరి శ్రీనివాస్

ఓ సారి తన మామిడి తోటకు పక్కనే ఉన్న ఐదెకరాల పొలాన్ని కౌలుకు తీసుకుని, పొద్దుతిరుగుడు పంట వేశాడు భూషయ్య. కొంత కాలం గడిచాక పూలు పెద్దవై గింజ పట్టాయి. ఇక ఒకటి రెండు రోజుల్లో ఆ పూలపై పక్షులు దాడి చేయగలవని ఊహించి తిమ్మప్పను కావలి ఉంచాడు.

కాపలా ప్రారంభించాడు. తిమ్మప్ప ఓ మంచె తయారు చేసుకుని దానిపై నుండి ఓ ఖాళీ డబ్బా, కర్రపుల్ల దగ్గర పెట్టుకుని బొడ్లో ఓ వడిసెలను కూడా దోపుకున్నాడు. భూషయ్య ఊహించినట్లుగానే ఓ రెండు రోజులకు పెద్ద పక్షుల గుంపొకటి చేను మీద వాలింది. ఖాళీ డబ్బా మీద కర్రపుల్లతో 'డబ, డబ' మోగిస్తూ చేనంతా కలియ తిరిగాడు తిమ్మప్ప. ఒక్క గింజను కూడా తిననీయలేదు మరి!

ఇలా రెండు మూడు రోజులు విరామం లేకుండా చేనంతా తిరిగే సరికి కాళ్ళ నొప్పులు మొదలయ్యాయి. ఆ రోజు మధ్యాహ్నం సద్దిమూట తీసుకొచ్చిన భార్యకు



నొప్పుల సంగతి చెప్పాడు తిమ్మప్ప.

" చేనంతా ఎంత సేపని తిరుగుతావు? నువ్వో మూలకు వెళ్ళేసరికి పక్షుల గుంపు మరో మూలకు వెళుతుంది. అయినా.... వడిసెల ఉందిగా! దాంతో రాళ్ళు విసురు. పక్షులకు వడిసెల అంటే చాలా భయం." అంది ఆమె.

భార్య చెప్పినట్లు చేయాలనుకున్నా, తిమ్మప్పకు వడిసెలలో రాయి ఉంచి విసరడం రాదు. అయితే ఆ విషయం భార్యకు చెప్పకుండా, " అలాగే.... రాళ్ళ దెబ్బకు పక్షులు భయపడి పారిపోవాల!" అన్నాడు. నవ్వుతూ, భార్య ఇంటికి వెళ్ళాక రాయిపెట్టి వడిసెల విసరడం సాధన చేయసాగాడు. పక్షులు ఉత్తరం వైపుంటే తిమ్మప్ప రాయి దక్షిణం వైపు వెళుతోంది. చాలా సేపు ప్రయత్నించాడు. కానీ, గురి కుదరడంలేదు. లాభం లేదని డబ్బా, కర్రపుల్ల తోటే తిరగసాగాడు.



రెండు రోజులు గడిచాక ఓ పూట భూషయ్య పొలానికొచ్చాడు. చేనంతా తిరుగుతున్న తిమ్మప్పను చూసి సంతోషిస్తూ, " పక్షులు బాగా భయపెట్టిస్తున్నట్లున్నావే.... పాపం, ఒక్కగింజ కూడా అవి రుచి చూసినట్లు లేవు" అన్నాడు నవ్వుతూ.

"డబ్బా శబ్దానికే పక్షులు పరారవుతున్నాయి. ఇంకా ఎక్కడైన మొండివి ఉంటే ఈ వడిసెల విసురుడుకు ప్రాణాలు అరచేతిలో పెట్టుకొని ఉడాయిస్తున్నాయి. ముఖం నిండా నవ్వుతో చెప్పాడు తిమ్మప్ప.

ఇద్దరూ మంచె ఎక్కి చూడసాగారు. చేనంతా బంగారు రంగు పూలతో మెరుస్తూ ఉంది. వాళ్ళు చూస్తుండగానే ఓ పక్షుల గుంపు చేను ఈశాన్యం వైపు వాలింది. తిమ్మప్ప డబ్బాను ఎంత గట్టిగా కొట్టినా అవి బెదిరిపోవడంలేదు. వాటిని తోలేందుకు మంచె దిగబోతున్న తిమ్మప్పను ఆపి, "నువ్వెళ్ళేసరికి అవి కడుపునిండా మేస్తాయి. వడిసెలతో రాళ్ళు విసురు" అన్నాడు భూషయ్య.

తిమ్మప్ప గతుక్కుమన్నాడు. తన 'ప్రావీణ్యం' భూషయ్యకు తెలిస్తే చీవాట్లు తప్పవనుకున్నాడు. అయినా ఎదురు చెప్పలేక వడిసెలలో రాళ్ళు ఉంచి విసిరాడు. ఎప్పటిలాగే అవి గురితప్పి నూటిగా నైరుతి మూలకు దూసుకెళ్ళాయి. రెండు మూడు సార్లు విసిరినా అదే పరిస్థితి!

భూషయ్యకు విషయం అర్థమైంది. " నువ్వెంత గురికాడివో తెలిసిందిలే! వెళ్ళి డబ్బాతోటే వాటిని తోలు." అన్నాడు కోపంగా.

తిమ్మప్ప మంచె దిగేలోపు నైరుతివైపు నుండి 'ఝుమ్' అంటూ శబ్దం వినిపించింది. ఇద్దరూ ఆ దిక్కుకు చూశారు. తేనెటీగల గుంపొకటి దూసుకు వస్తోంది! ఒక్కక్షణం అవి ఎక్కడి నుంచి వస్తున్నాయో అర్థం కాలేదు. అయితే అవి నైరుతి మూలలోని చింత చెట్టుపై ఉన్న తేనెపట్టు వని తిమ్మప్ప గ్రహించాడు. భూషయ్యకూ అదే తోచింది. వడిసెల రాళ్ళు తగిలి ఆ పరిస్థితి

ఏర్పడిందని ఇద్దరూ గ్రహించారు.

ఒక్క ఉదుటున ఇద్దరూ మంచె దిగి మామిడి తోట వైపు పరుగెత్తారు. మామిడి తోటలో భూషయ్యకు ఓ పాత ఇల్లు ఉంది. ప్రస్తుతానికి దానిని వాడడంలేదు. అందులో ఏమి లేవు కాబట్టి తాళం కూడా వేయరు. ముందు భూషయ్య, వెనకాల తిమ్మప్ప వగుర్చుతూ ఆ ఇంటి వద్దకు చేరుకున్నారు. తలుపుకు గడియకూడా వేసి లేదు. ఇద్దరూ ఆ ఇంట్లోకి దూరి గడియ పెట్టుకున్నారు. ముప్పు తప్పాలంటే అరగంటైనా ఉండాలనుకున్నాడు భూషయ్య.

" అంతా నీవల్లే.... విసరడం చేత కానప్పుడు వడిసెల ఎందుకు పెట్టుకున్నావురా? ఇక్కడ ఇల్లు ఉండబట్టి సరిపోయింది. లేకుంటే ఆ తేనెటీగల దెబ్బకు మన ప్రాణాలు గాల్లో కలిసేవి. ఏదో ఒక సమస్య లేకుండా నువ్వసలు ఖాళీగా ఉండవు కదా!" అని తిమ్మప్పపై విరుచుకుపడ్డాడు భూషయ్య. ఏం మాట్లాడాలో తెలియక తిమ్మప్ప మౌనంగా ఉన్నాడు.

కొన్ని క్షణాల తర్వాత ఏం చేయాలో తోచక జేబులోంచి చుట్ట తీసి ముట్టించాడు భూషయ్య. అగ్గి పుల్లను ఆర్పే సమయంలో గదిలో ఓ మూల ఎవరో కన్పించారు. " ఎవరది?'' గద్దించి అడిగాడు. సమాధానంలేదు. ఇంకో అగ్గిపుల్ల ముట్టించేలోపు వీరిద్దరినీ నెట్టుకుని తలుపు తీసుకుని బయటికి పరిగెత్తాడా అపరిచితుడు. బయటికి అడుగు పెట్టిన వెంటనే అతణ్ణి తేనె టీగలు చుట్టు ముట్టాయి. పరిస్థితి గమనించిన భూషయ్య వెంటనే తలుపేశాడు. అయితే అపరిచితుడెవరో అర్థం కాలేదు. కాసేపాగి మెల్లగా తలుపు తెరిచి చూశాడు. ఈగలన్నీ వెళ్ళిపోయాయి. కానీ, కాస్త దూరంలో మూలుగుతూ పడున్న అపరిచితుడు కనిపించాడు. అతని ఒళ్ళంతా వాచి ఉంది.

తిమ్మప్పను పంపి వైద్యుడు మీనాచారిని రప్పించాడు భూషయ్య. మీనాచారి వచ్చి అపరిచితుడి ముఖం చూసి ఖంగు తిన్నాడు. అపరిచితుడు ఎవరోకాదు, గజ దొంగ సాంబడు! గతంలో ఒకటి రెండు సార్లు మీనాచారి వద్ద రహస్యంగా వైద్యం కూడా చేయించుకున్నాడు.

ఇటీవల శ్రీపురం చుట్టు పక్కల గ్రామాల్లో దొంగ తనాలు పెరిగాయి. దానికి కారణం సాంబడే! నిఘా ఎక్కువ కావడంలో పగలంతా దాక్కుని రాత్రి దొంగతనాలు చేయసాగాడు. రహస్యంగా ఉంటుందని మామిడి తోటలోని ఇంట్లో దాక్కుని ఇలా తేనెటీగల బారిన పడ్డాడు.

రాజభటులకు విషయం తెలపడంతో, వాళ్ళు అతనికి వైద్యం పూర్తి చేయించి చెరసాలకు తీసుకెళ్ళాడు. గజ దొంగను పట్టించినందుకు భూషయ్య, తిమ్మప్పలను ఘనంగా పొగిడి సత్కరించాడు.

తిమ్మప్ప వడిసెల రాయి గజదొంగల్నే ఖంగు తినిపించింది మరి!




# "ఆపదలో విచక్షణ"

- పుప్పాల కృష్ణమూర్తి

**ఐ**దో పిట్ట నేల మీద వాలి "ప్రతి వారికీ ఆపదలు వస్తాయి. అలాంటి సమయంలోనే, మన మిత్రులెవరో శత్రువులెవరో చూసి శరణు పొందాలేకాని మన విరోధుల చెంత చేరకూడదు. అలా చేరి తనవు చాలించిన ఓ జింక వృత్తాంతం చెబుతా విను" అని కథ చెప్పడం మొదలు పెట్టింది.

సమజారణ్యంలో నేనున్నప్పటి సంగతి. అదే అడవిలో రెండు జింకలు ఉండేవి. ఒక దాని పేరు సారంగి. మరో దాని పేరు సులోచన. అవి పరస్పరం ఎంతో స్నేహంగా ఉండేవి. లేచింది మొదలు కలిపి తిరిగేవి. పక్క పక్కనే జీవిస్తూ, కమ్మని కబుర్లు చెప్పుకుంటుండేవి.

ఒకసారి చెట్ల మధ్య పచ్చికమేస్తూ, కబుర్లు చెప్పుకుంటుండగా ఓ పెద్ద పులి, చిరుతపులి చూశాయి. అవి అడుగులో అడుగు వేసుకుంటూ దగ్గరకు రాసాగాయి. దగ్గరకు వచ్చి అమాంతం మీద పడి కొరికి చంపేసి తిందామనుకుని నిశబ్ధంగా రాసాగాయి. మాటల్లో ఉన్న జింకలు గమనించాయి. ఆకు చప్పుడుకు వెనక్కు తిరిగిన సారంగి మృత్యువు పులి రూపంతో పొంచుకురావడాన్ని



చూసింది. "పరిగెత్తు" అని గట్టిగా ఓ కేక పెట్టి, పదడుగుల దూరం దూకి, శక్తి కొద్దీ పరిగెత్త సాగింది. దాని వెనకాలే సులోచన జింక కూడా బలం కొద్దీ ఉరకసాగింది. ప్రాణభయంతో. అవి రెండూ ఒకే దిక్కు పరిగెత్తాయి. చాలా సేపు. వాటి నందుకోవాలని పులి, చిరుతపులి వెంట పడ్డాయి. అవి పరిగెత్తి, పరిగెత్తి ఓ గూడెం దగ్గరకు పోయాయి. అక్కడో పశువుల మంద మేస్తూ కనిపించింది.

"ఇటు రా మిత్రమా! ఊళ్ళోకి వెళ్ళకు. కుక్కలుంటాయి ప్రమాదం" అని హెచ్చరించి, పశువుల మందలో జొరబడింది సారంగి.



"వాటిని కూడా పులులు తినేస్తాయి. అవి మనకేం రక్షణ నివ్వగలవు?" అంటూ ఊళ్ళోకి పరిగెత్తిన సులోచన జింక ఓ యింట్లో దూరింది. మంద మధ్యలో చేరే సరికి, పశువులన్నీ గుడ్లెర్రజేసి, బుసలు కొడుతూ పులివైపు చూశాయి. అవి కొమ్ములు ఎక్కు పెట్టి వలయాకారంగా నిలబడ్డాయి. 'మా దగ్గరకు వచ్చావో పొడిచి, పగల చీరేస్తాం' అని రంకెలు వేసాయి. వాటిని చూసిన పెద్ద పులికి భయమేసింది. ఏమీ చేయలేక నాలుకతో పెదాలు తడుపుకుంటూ అక్కడే కూర్చుంది. నోటికాడి ఆహారం చేజారిపోయే సరికి, దిగులుతో మెల్లగా వెనుదిరిగింది.

తరుముకుంటూ ఊరి వద్దకు పోయిన చిరుతపులి, సారంగి జింక ఊళ్ళో పడేసరికి మనుషుల్ని చూసి, విధిలేక వెనక్కు తిరిగింది. పెద్దపులి, చిరుతపులి కలుసుకుని, విచారిస్తూ మరోవైపు ఆహారం వెదుక్కుంటూ వెళ్ళిపోయాయి.

పులులు కనుమరుగు కాగానే, ప్రాణాలు కాపాడిన పశువులకు కృతజ్ఞతలు చెప్పి, దిక్కులు చూస్తూ మెల్లగా తన యింటి వైపు బయలుదేరింది సారంగి.

యింట్లో దూరిన సులోచన జింకను ఒడిసి పట్టుకుంది యజమానురాలు. వదిలి వేయమని, గడగడా వణుకుతూ వేడుకుంది జింక. కాని చుట్టూ చేరిన మాంసాహారులు సులోచన జింక మొరవినలేదు. మంచి మాంసం దొరికిందని, ఆనందంతో కేరింతలు కొట్టసాగారు.

ఎన్నో రోజులు ఎదురు చూసింది సారంగి తన మిత్రుడి కోసం. కాని ఎంతకూ కనబడలేదు.

చెప్పినా వినకుండా, ప్రమాద కరమైన చోటుకు వెళ్ళిన స్నేహితుని తలుచుకుని కన్నీరు కార్చింది.

"చూశావా పాపా! ఆపద నుండి రక్షించుకొనే సమయంలోకూడా విచక్షణ జ్ఞానాన్ని కోల్పోకూడదు." అంటూ తుర్రుమని ఎగిరిపోయింది ఐదువ పిట్ట.





మామయ్య మాట

# చదివే అవకాశాన్ని సద్వినియోగం చేసుకోవాలి

దీర్ఘ వేసవి సెలవుల తరువాత మళ్ళీ బడులు తెరుస్తున్నారు. కొత్త తరగతి, కొత్త క్లాసు, కొత్త పుస్తకాలు, కొత్త టీచర్లు ...... అంతా కొత్తే. చాలా కాలం తరువాత పాత స్నేహితులు తిరిగి కలుసుకుంటారు. కబుర్లు చెప్పుకుంటారు. ఆటలు ఆడుకుంటారు. బాలలకు ఎటు చూసినా ఆనందంగానే అగుపడుతుంది.

స్కూలులో బాలలు మొదటగా చేయవల్సిన పని మాష్టార్లు చెప్పే పాఠాలను శ్రద్ధగా వినడం, ఇచ్చిన హోంవర్కును క్రమం తప్పకుండా చేయడం. ఏ రోజు పాఠాల్ని ఆ రోజు చదివితే పరీక్షల సమయంలో ఎలాంటి వత్తిడి ఉండదు. మామూలుగా బడికి పోయినట్లే వెళ్ళి పరీక్షలు రాసి మంచి మార్కులు తెచ్చుకోవచ్చు.

బడిలో చదువే కాకుండా ఆటలు, పాటలు కూడా ముఖ్యమే. అందువల్ల క్లాసులు లేనప్పుడు, ముఖ్యంగా సాయంకాలం, కొంతసేపైనా ఆడాలి. ఆనందించాలి. పాటలు కూడా నేర్చుకోవాలి. కథలు వినాలి. చెప్పాలి. పాఠాలేగాకుండా విజ్ఞానాన్ని పెంపొందించు కునేందుకు బాలలకే ప్రత్యేకంగా ఉద్దేశించిన పుస్తకాలను, ప్రచురణలను చదవాలి. దృష్టిలోకి వచ్చిన అంశాలపై కథలు లేదా వ్యాసాలను రాయాలి. పాటలను కూడా కట్టవచ్చు. దీనికై ఉపాధ్యాయులు, ఇతర పెద్దల సహాయాన్ని తీసుకోవచ్చు. అవకాశం వచ్చినప్పుడల్లా సాంస్కృతిక, వక్తృత్వ కార్యక్రమాలలో పాల్గొనాలి.

టీవి చూడడాన్ని తగ్గించాలి. ప్రతి రోజు అన్నం తినే సమయంలోనే టీవిని చూడడానికి పరిమితం చేసుకుంటే మంచిది. టీవిలో వచ్చే వాణిజ్య ప్రకటనల్లో చూసిన వస్తువులను కొనాలని లేదా టీవిలో చూపించినట్లుగా ఉండాలని ప్రయత్నం చేయకూడదు. టీవి వాణిజ్య కార్యక్రమాలలో చూపించేవి కృత్రిమమైనవి. కంపెనీ వాళ్ళు వాళ్ళ లాభాలను పెంచుకోవడానికి ఈ ప్రకటనలను ఇస్తారు. అందువల్ల వీని ఆకర్షణకు గురికాకూడదు. మన అవసరాల్ని కనిపెట్టి అమ్మనాన్నలే మనకు కొనిపెడతారు. కేవలం టీవిలో చూపించినందువల్ల అవే కావాలని అమ్మా నాన్నలను వత్తిడి చేయకూడదు. మారం చేయకూడదు.

కారణాలేవైనప్పటికి, చదివే అవకాశాలు ఇంకా అందరి బాలలకు అందుబాటులో రాలేదు. అందువల్ల ఇప్పుడు బడులకు వెళ్ళి చదువుకునే బాలలందరూ ఒక విధంగా అదృష్టవంతులనే భావించాలి. చదువుకోవడానికి వచ్చిన ఈ అవకాశాన్ని ఓ అదృష్టంగా భావించి బాగా చదువుకోవాలి. విజ్ఞానవంతులు కావాలి. కేవలం పరీక్షలలో మార్కులు తెచ్చు కునేదానిపై శ్రద్ధ చూపకూడదు. పాఠాలలో చెప్పే విషయాలను అర్థంచేసుకోవాలి. ఆటలు, పాటలు, సాంస్కృతిక కార్యక్రమాలతో విజ్ఞానాన్ని పెంచుకొని, వ్యక్తిత్వాన్ని వికసింప చేసుకోవాలి. మానవ విలువలతో పెరిగి బాధ్యత గల ఉత్తమ పౌరునిగా రూపొందాలి.






గోపి నవ రసాల్లో నీకు
ఏ రసం బాగా ఇష్టం?
బత్తాయి
రసం సార్!
పవన్


అల్లాఉద్దీన్ అద్భుత దీపాన్ని నీ చేతికి
ఇస్తే ఏం చేస్తావు గోపి?
మీ పాఠం బాగా రావాలని
కోరుకుంటాను సార్!
పవన్





తింటే బలపడతావ్
తొక్కితే జారిపడేదేందిరా?
అరటి తొక్కను
తొక్కి నేను
ఎప్పుడు పడలేదు
సార్!




కరెంట్‌కి, మెరుపుకి
తేడా ఏమిటి?
కరెంటుకు డబ్బు కట్టాలి.
రెండో దానికి అవసరం లేదు.



తల్లిదండ్రులకు

# మీ పిల్లవాడు పాఠాల్లో వెనుకబడుతున్నాడా?



**మీ** పిల్లవాడు పాఠాల్లో వెనుకబడితే ఆందోళన చెంది పిల్లవాడిని దండించకండి. వాడి టీచర్లను లేదా స్కూల్‌ను నిందించకండి. దానికి చాలా కారణాలుండొచ్చు. మీరు పిల్లవాడిని బాగా చిన్న వయస్సులోనే స్కూలులో చేర్చివుండొచ్చు. లేదా క్లాసులో అందరికంటే మీ పిల్లవాడే చిన్నవాడయి వుండడం వల్ల తనకంటే పెద్ద పిల్లలతో పోటీ పడలేక పోతూండవచ్చు. అనారోగ్యం వల్ల చాలా రోజులు స్కూలు మానేసి వుండవచ్చు. 5,6 సంవత్సరాల పిల్లలు తరచు అనారోగ్యానికి గురవడం అసాధారణమేమీకాదు. ఒక్కొక్కసారి తల్లిదండ్రులు గమనించలేని శారీరక లోపాలు ఉండవచ్చు. మొదటి వరుసలో కూర్చుంటే గాని వారికి బోర్డు మీద టీచరు రాసింది కనపడకపోవచ్చు. ఇది దృష్టి దోషం వల్ల అయివుంటుంది. వినికిడిశక్తి లోపం వల్ల ఉపాధ్యాయుడు చెప్పేది సరిగ్గా వినపడకపోవచ్చు. కొంతమంది పిల్లలకు చదవడంలో, వ్రాయడంలో, ఉచ్చారణలో, గణితంలో ప్రత్యేకమైన వెనుకబాటుతనం ఉంటుంది. అందువల్ల పిల్లల్ని డాక్టరు వద్దకు తీసుకెళ్ళి క్షుణ్ణంగా చూపించండి. అవసరమైతే వారు వెనుకబడిన విషయాలలో ప్రత్యేక శ్రద్ధ చూపవలసిందిగా టీచరును కోరాలి.

ఒక్కొక్కసారి ఇంటి వాతావరణమే పిల్లలు చదువులో వెనకబడడానికి కారణమవుతుంది. తల్లిదండ్రులు చీటికీ మాటికీ గొడవలు పడడం, ఇంట్లో పిల్లలకు తగిన ప్రేమ లభించకపోవడం, ఇంట్లో ఇంకొక బిడ్డ పుట్టడం వల్ల తల్లిదండ్రులు ఈ పిల్లవాడిపై తగిన శ్రద్ధ చూపలేకపోవడం కూడా పిల్లలు సరిగ్గా చదవకపోవడానికి కారణాలవుతాయి. పిల్లలకు టీచర్‌తో సత్సంబంధాలు లేకపోవడం కూడా ఒక

కారణమే. అదే అయితే, మీరొక సారి స్కూలుకు వెళ్ళి హెడ్‌మాస్టార్ లేక ప్రిన్సిపాల్‌తో చాకచక్యంగా మాట్లాడి సమస్య పరిష్కరించడం మంచిది.

కొందరు తల్లిదండ్రులు తమ పిల్లల అసలు వయసు కన్నా ఎక్కువ చూపి త్వరగా పై క్లాసుకు పంపాలని చూస్తారు. ఒక క్లాసులో ఎక్కువ ప్రతిభ కనబరిచే విద్యార్థులకు డబల్ ప్రమోషన్ కోరుకొనే తల్లిదండ్రులు కూడా ఈ కోవలోకే వస్తారు. ఇది ఆరోగ్యకరమైన పద్ధతి కాదు. క్లాసులో మిగిలిన పిల్లల కంటే ఒకటి, రెండు సంవత్సరాలు తక్కువ వయసున్న పిల్లవాడు, మిగిలిన వారితో కలపడానికి ఇబ్బంది పడతాడు. అయిదేళ్ల పిల్లవాడి కంటె నాలుగేళ్ల వాడి పరిపక్వత, అవగాహన శక్తి తక్కువగా వుంటుంది. అందువల్ల క్లాసులో వెనకబడి వుంటాడు. అలాగే డబల్ ప్రమోషన్ వల్ల పిల్లల మీద అదనపు భారం పడుతుంది. ఒక క్లాసులో బాగా మార్కులు వచ్చే అమ్మాయి డబల్ ప్రమోషన్ పొందాక ఆ స్థాయిలో మార్కులు సంపాదించలేకపోవచ్చు. దానితో అనవసరమైన నిస్పృహ, ఒత్తిడితో బాటు పిల్లలలో వారి సామర్థ్యం మీద నమ్మకం తగ్గిపోయే ప్రమాదముంది.

అందువల్ల, మీ పిల్లవాడి సమస్యలను అర్థం చేసుకోడానికి ప్రయత్నం చేయండి. సమస్య పరిష్కారానికి ప్రయత్నం చేయండి. ప్రతి రోజు బడిలో చెప్పిన పాఠాల వివరాలను కనుక్కోండి. ఈ పాఠాలను ఏమేర అర్థం చేసుకున్నది ప్రశ్నించి తెలుసుకోండి. అర్థం చేసుకోవడంలో ఏదైన లోపం అగుపిస్తే, వీలున్నంతవరకు అర్థం చేయించడానికి మరో ప్రయత్నం చేయండి. మీకు వీలుపడకపోతే ఇతరుల సహాయం తీసుకోండి. హోంవర్క్ క్రమం తప్పకుండా చేసేందుకు సహాయం పడండి. అవసరమనుకుంటే పిల్లల డాక్టర్ నిపుణుడి సలహా తీసుకోండి. దీని ద్వారా మీరు మీ పిల్లవానికి బాగా దగ్గరవుతారు. పిల్లవాని సమస్యలను పూర్తిగా తెలుసుకునే వీలుగలుగుతుంది. అంతిమంగా ఇది మీ పిల్లవాడు పాఠాలు నేర్చుకోవడంలో వెనుకబాటు తనాన్ని అధికమించడానికి సహాయం పడుతుంది.

**(డా. సుభాష్ సి ఆర్యా 'పిల్లల అలవాట్లు' నుంచి సౌజన్యంతో )**

## పిల్లలకు ఇవ్వతగ్గ ఆటవస్తువులు

### 7 నుంచి 18 మాసాల మధ్య

బొమ్మలను ముట్టుకుని, వదిలెయ్యగలరు. విసిరెయ్యగలరు. పేపర్లు చించేస్తారు. రెండు వస్తువుల్ని కలపడం, విడదియ్యడం చెయ్యగలరు. బొమ్మలు చూస్తారు.

### సూచించే బొమ్మలు

బంతులు, కౌగలించుకుని ఆడుకునే జంతువులు, ఇతర బొమ్మలు, రింగులు, పేర్చే వస్తువులు, బట్టతో కుట్టిన పుస్తకాలు, లాగి, తోసే బొమ్మలు ఇవ్వవచ్చు.






| | | | | |
|---|---|---|---|---|
| | 1 | 2 | | 3 |
| 4 | | | | |
| 5 | | | | |
| | | | | |
| 6 | | | | |

(పద ప్రహేళిక)

ఆచార్య నందూరి గోవిందరావు

కింద ఇచ్చిన దీర్ఘ చతురస్రంలో అడ్డం, నిలువు ఆధారంతో ఎంపిక చేసుకొన్న పదంతో పూర్తి చేయండి. పదంలో ఉండాల్సిన అక్షరాల సంఖ్య ఆధారం పక్క బ్రాకెట్టులో ఇవ్వబడింది. ఇవి ఒక రకమైన పొడుపు కథలు. కరెక్టు సమాధానాలు ఇదే సంచికలో వేరే పేజీలో ఇవ్వబడ్డాయి. వీనితో మీ సమాధానాలను పోల్చి చూసుకోండి.

ఆధారాలు

అడ్డం :

1. చాటింపు, వెల్లడి (4)
5. కుక్కలు (5)
6. దొంగిలించుట, మోసగించుట (4)

నిలువు :

2. జైలు, కారాగారం (5)
3. పాండవులలో నాల్గవవాడు- మాద్రీతనయుడు (4)
4. పేడ, పెంట, మలము (4)



## అమ్మ - అక్షరం

అమ్మకు
అక్షరానికీ తేడా
ఏమి లేదు
అమ్మ-జన్మనిస్తుంది
అక్షరం- ఆ జన్మకు
ఒక విలువనిస్తుంది
అందుకే....

అమ్మను మరువకు
అక్షరాన్ని విడువకు
ఆ ఇద్దరూ ఉంటేనే
జీవితానికి అందం ఆనందం
అందుకే అమ్మ- అక్షరం
మనకు కావాలి!

- ఎస్.కె. మష్కూర్



మ్యాజిక్

# కళ్ళకు గంతలున్నా చదివే అద్భుత దృష్టి

- షేక్ జహీర్ బాషా

ప్రదర్శన : నల్లటి, నాలుగు మడతలున్న రెండడుగుల గుడ్డను చూపి ఒక ప్రేక్షకుడ్ని కట్టమంటాడు మెజీషియన్. ప్రదర్శన బల్లముందు కూర్చొని ప్రేక్షకులు వ్రాసిన ప్రశ్నల కాగితములను చదివి వినిపిస్తూ సమాధానం తమాషాగా చెప్పి ఆశ్చర్య పరుస్తుంటాడు మెజీషియన్.

**అంతరంగము** : కళ్ళకు గంతలు కట్టే సమయంలో ప్రేక్షకుల దృష్టిలో పడకుండా కండ్లు అతి గట్టిగా అదిమిపట్టాలి. ముడి వేసిన తర్వాత తిన్నగా కండ్లు తెరవాలి. అప్పుడు క్రింది అంచుకు కండ్లకు మధ్యన ఏర్పడిన కొద్ది ఖాళీ గుండా చూస్తూ చదవ వచ్చును.

**గమనిక** : కళ్ళు లోతుగా ఉండేవారు. ఈ ప్రదర్శన చేయలేరు. నల్లటి గుడ్డ నాలుగు పొరలు, బెత్తెడు వెడల్పున్న పొడవైన గుడ్డ ఎన్నుకోవాలి. దృష్టిలోపమున్నవారు ఈ ప్రదర్శనకు అనర్హులు. 





# చెప్పులు తెచ్చిన తిప్పలు

- జ్యోతిర్మయి

**కా**శీపట్నంలో వెనకటికి వరహాలరావు అనే పిసినారి వ్యాపారి ఉండేవాడు. ఉప్పులు, పప్పులు అమ్మడం దగ్గర్నుండి బంగారు నగలు అమ్మడం వరకు ఆయన చేయని వ్యాపారం లేదు. చాలా రకాల వ్యాపారాలు చేసి చాలా డబ్బు గడించాడు. కానీ ఏం లాభం? పిల్లికి బిచ్చం పెట్టడు. తనూ కడుపు నిండా తినడు. ఇదేమని అడిగితే, "కడుపుకి తింటే ఏమొస్తుంది? ప్రాణం నిలుపుకోడానికి నాలుగు మెతుకులు తింటే చాలదూ? తిండి మీద ఖర్చు పెడ్తే ఏం మిగలుతుంది? బూడిద...." అని నవ్వేసేవాడు. అంత పిసినిగొట్టు బట్టల గురించి పట్టించుకుంటాడా? చెప్పండి. ఏడాదికి ఒక జత బట్టలు కొంటాడు. చెప్పుల విషయమైతే మరీ అధ్వాన్నం. ఐదారేళ్ల నుండి ఒకే జత చెప్పులు వాడుతున్నాడు. అవి తెగితే మళ్లీ మళ్లీ కుట్టించుకుంటాడేగాని కొత్తవి ఛస్తే కొనలేదు. ఇక ఈ పాత చెప్పుల్ని బాగు చేయడం కుదరదని ఊళ్లో వున్న అన్ని చెప్పుల దుకాణాల వాళ్లూ నిర్మొహమాటంగా చెప్పేశారు. అప్పటినుండి తన చెప్పుల్ని తనే మరమ్మతు చేసుకుంటున్నాడు వరహాలరావు. అలా... వరహాలరావు చెప్పుల గురించి ఊళ్లో వాళ్లందరికీ తెలిసిపోయింది. వరహాలరావుకు 'చెప్పుల వరహాలరావు' అనే పేరు స్థిరపడింది.

ఒకరోజు వరహాలరావు తన మిత్రుడు భూషణం మనవరాలి పుట్టినరోజు వేడుకకు వెళ్లాడు. భూషణం ధనవంతుడు.



బాగా పలుకుబడి కలిగినవాడు. అందుకే అతని ఇంట్లో జరుగుతున్న వేడుకకు పట్టణంలోని ప్రముఖులందర్నీ పిలిచాడు. వరహాలరావు వెళ్లేసరికి ఇల్లంతా అతిథులతో నిండిపోయింది. వరహాలరావు మిత్రుణ్ణి పలకరించి, వెళ్లి భోం చేశాడు. తిరిగి బయల్దేరేటప్పుడు చెప్పుల కోసం ఆగాడు. అక్కడ ఖరీదైన చెప్పుల జతలు చాలానే ఉన్నాయి. వాటిని చూడగానే వరహాలరావుకు కన్నుకుట్టింది. తన పాత చెప్పుల్ని అక్కడే వదిలేసి కొత్తవి వేసుకొని ఎంచక్కా వెళ్లిపోయాడు. అయితే వరహాలరావు వేసుకున్న చెప్పులు ఆ పట్టణ న్యాయాధికారివి. ఆయన వేడుక పూర్తయ్యాకగానీ ఈ విషయం గమనించలేదు. తన అంగ రక్షకుల్ని అడిగితే వరహాలరావు వేసుకెళ్లాడని చెప్పారు. ఆయన వెంటనే భటుల్ని పంపి వరహాల రావుని న్యాయస్థానానికి ఈడ్చుకు రమ్మన్నాడు. వరహాలరావు న్యాయాధికారి అడిగిన ప్రశ్నలన్నింటికీ కుంటిసాకులు చెప్పాడు. ఆ సమాధానాలు విన్న న్యాయాధికారి కోపంతో ఊగిపోయాడు. చెప్పులు దొంగిలించి నందుకు రెండు వేల వరహాల జరిమానా విధించాడు. వరహాలరావు లబోదిబోమని మొత్తుకున్నా ఆయన మెత్తబడలేదు.

'నీ పిసినారితనానికి ఇదే శిక్ష' అని అక్కడినుండి వెళ్లిపోయాడు న్యాయమూర్తి. వరహాలరావుకు జరిమానా కట్టక తప్పలేదు.



ఇంటికొచ్చిన తర్వాత.... 'ఇదంతా ఈ పాడు చెప్పుల మూలంగానే వచ్చింది. వీటినీ.....' అని కోపంగా అంటూ తన పాత చెప్పుల్ని తీసి కిటికీలో నుండి పక్కనే వున్న నదిలోకి విసిరేశాడు. ఆ చెప్పులు ఆ దగ్గర్లోనే చేపలు పడ్తున్న జాలరి వలలో పడ్డాయి. వాటి మూలంగా అతని వల చిరిగిపోయింది. ఇక దానితో చేపలు పట్టడం వీలవదు. దాంతో జాలరికి విపరీతమైన కోపం వచ్చింది. ఆ చెప్పులు ఎవరివో అతను వెంటనే కనిపెట్టేశాడు. తన పొట్ట కొట్టిన ఆ చెప్పుల్ని తీసుకొని బలం కొద్దీ వరహాలరావు ఇంటివైపు విసిరాడు. అవి కిటికీలో నుండి దూసుకొని టేబుల్ మీద అలంకరణ కోసం పెట్టిన గాజు కూజాకు తగిలాయి. ఆ కూజా కాస్తా కిందపడి పగిలి పోయింది.

ఆ శబ్దం విని పరుగెత్తు కొచ్చిన వరహాలరావు గుండెలు జారిపోయాయి. "అయ్యో... అయ్యో.... బంగారంలాంటి కూజా. ఎంతో ముద్దుగా వుందని వెయ్యి వరహాలు పెట్టి మరీ కొన్నాను. రెండేళ్లైనా గడవకముందే దీనికీ, నాకూ రుణం తీరిపోయింది. ఇదంతా ఈ చెప్పుల మూలంగానే జరిగింది. వీటినీ....." అని కోపంతో ఊగిపోతూ చెప్పుల్ని తీసుకెళ్లి చెరువులో పడేశాడు.

ఊళ్లో వాళ్లందరికీ ఆ చెరువు నుండే నీటి సరఫరా జరుగుతుంది. వరహాలరావు చెప్పులు వెళ్లి నీళ్ల పైపులకు అడ్డం పడ్డాయి. ఇంకేముంది? ఊళ్లో నీటి సరఫరా



నిలిచిపోయింది. 'ఏంటా?' అని చూస్తే పైపులకు అడ్డంగా చెప్పులు కనిపించాయి. అవి ఎవరివో ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు కాబట్టి భటులు వచ్చి వరహాలరావును మళ్లీ న్యాయస్థానానికి ఈడ్చుకెళ్లారు. ఈసారి న్యాయాధిపతి మరింత మండిపడ్డారు. పట్టణంలోని ప్రజలందరికీ అసౌకర్యం కలిగించినందుకుగాను మూడువేల వరహాలు చెల్లించాల్సిందేనని తీర్పుచెప్పారు. వరహాలరావు ఏడ్చుకుంటూనే జరిమానా చెల్లించాడు. తన పాత చెప్పుల్ని తీసుకొని ఇంటికొచ్చాడు.

"వీటిని నీళ్లల్లో పారెయ్యకూడదు. తగలబెట్టాలి. అప్పుడుగానీ వీటి పీడ విరగడవదు. ముదనష్టపు చెప్పులు బాగా తడిచిపోయాయి. వీటిని బాగా ఎండనిచ్చి అప్పుడు తగలబెట్టాలి" అనుకుంటూ వాటిని మిద్దె మీదకు విసిరాడు వరహాలరావు. పక్కింటి పిల్లి ఆ చెప్పుల్ని చూసింది. వాటితో అది ఆడుకోవడం మొదలుపెట్టింది.



రెండు రోజుల తర్వాత ఓ గర్భిణీ స్త్రీ తల మీద బరువుతో వరహాలరావు ఇంటి ముందుగా వెళ్తోంది. ఆ సమయంలో పిల్లి చెప్పులతో ఆడుకుంటోంది. పొరపాటున ఒక చెప్పు వచ్చి దారిన పోతున్న స్త్రీ మీద పడింది. ఆమె అక్కడే స్పృహ తప్పి పడిపోయింది. బజారున వెళ్తున్న వాళ్లంతా ఆమెను హుటాహుటిన వైద్యుడి దగ్గరకు తీసుకెళ్లారు. ఈ విషయం తెలిసిన వెంటనే భటులు వరహాలరావు ఇంటికొచ్చి, అతన్ని మళ్లీ న్యాయస్థానానికి తీసుకెళ్లారు.

అతన్ని చూసిన న్యాయాధిపతి, "ఏమయ్యా.... నీకెన్నిసార్లు జరిమానా విధించినా బుద్ధిరాదా? ఇలాంటి పనులెందుకు చేస్తావు? అనవసరంగా గర్భిణీ స్త్రీ ఉసురుపోకున్నావు కదయ్యా...." అంటూ చీవాట్లు పెట్టాడు. వరహాలరావు అందులో తన తప్పేమీ లేదని చెప్పినా వినిపించుకోలేదు. నాలుగు వేల వరహాలు జరిమానా విధించాడు న్యాయాధిపతి. వరహాలరావుకు ఆ మొత్తం కట్టక తప్పలేదు. ఈసురోమంటూ చెప్పులతో ఇంటికి చేరాడు. చెప్పుల్ని తీసుకొని నేరుగా పశువుల దొడ్లోకి వెళ్లాడు. ఇక లాభం లేదని వానిని కాల్చడానికి ప్రయత్నిస్తున్నాడు. ఈలోపల పక్కింటి పరంధామయ్య వరహాలరావు తన గడ్డి వాము వెనక కూర్చొని ఏదో చేస్తుండడాన్ని చూశాడు. వాళ్లిద్దరికీ ఈ మధ్యనే పొలం సరిహద్దు విషయంలో గొడవయ్యింది. అది మనసులో పెట్టుకొని వరహాలరావు తన గడ్డి వాము తగలబెడ్తున్నాడనుకున్నాడు పరంధామయ్య. వెంటనే గోల గోలగా అరుస్తూ చుట్టుపక్కల వాళ్లందర్నీ పిలిచాడు. అందరూ వచ్చి వరహాలరావును పట్టుకొని, న్యాయాధికారి దగ్గరకు తీసుకెళ్లారు.

ఆయన వరహాలరావును చూసి, "ఇప్పుడే కదయ్యా వెళ్లావు. అప్పుడే మళ్లీ





ఎవరి కొంప ముంచావు? నీకెన్ని సార్లు చెప్పినా బుద్ధి రాదా? నిన్ను చెర సాలలో పెట్టాల్సిందే" అంటూ న్యాయాధికారి చీవాట్లు పెట్టాడు.

వరహాలరావు కన్నీళ్ల పర్యంతమవుతూ, "ఇందులో నా తప్పేమీ లేదంటే మీరెవరూ నమ్మరు. ఇప్పటికే జరిమానాల కింద నా ఆస్తి మొత్తం హరించుకుపోయింది. ఇదంతా ఈ పాత చెప్పుల మూలంగానే జరిగింది. నాతోపాటు వీటిని కూడా చెరసాలలో పెట్టండి. అప్పుడు ఎవరికీ ఏ చింతా ఉండదు" అన్నాడు.

ఆ మాటలకు న్యాయాధికారి కరిగిపోయాడు. "మన జీవితంలో ఎన్నో సంఘటనలు జరుగుతుంటాయి. మనకు ఎంతోమంది తారసపడ్తుంటారు. వాళ్లందరితో మనం కలిసిపోవాలి. జరిగే సంఘటనల్లోని మంచిని గ్రహించి చెడును వదిలెయ్యాలి. కొత్త కొత్త విషయాలు నేర్చుకుంటూ ముందుకు వెళ్లాలి. పాత వాటినే పట్టుకు వేలాడకూడదు. ఇది అన్నిటితోపాటు నీ చెప్పులకూ వర్తిస్తుంది'' అన్నాడు న్యాయాధికారి. వరహాలరావు ఆయన మాటల్లోని అంతరార్థాన్ని అర్థం చేసుకున్నాడు. ఆనాటి నుండి పీనాసితనాన్ని వదిలిపెట్టాడు. తనకు వున్న దాంట్లోనే సంతోషంగా, హాయిగా జీవించసాగాడు. తనకు వీలున్నమేరకు నలుగురికీ సాయపడసాగాడు.

## దోమలు రక్తాన్ని ఎందుకు పీల్చుతాయి?



మన శరీరంలో దోమలు వాలి కుడుతూ రక్తాన్ని పీల్చుతుంటాయి. అయితే అవి రక్తాన్ని ఆహారంగా స్వీకరించడానికే అలా చేస్తున్నాయనుకుంటే పొరపాటే దోమలు గుడ్లు పెట్టడానికి, శరీరంలోని గుడ్లు అభివృద్ధి చెందడానికి అవసరమైన ఒక విటమిన్ ఈ రక్తం నుండే లభిస్తుంది. అందుకే దోమలు రక్తాన్ని పీల్చుతాయి. ఇలా రక్తాన్ని ఒకసారి పీల్చినప్పుడల్లా దోమలు ఒక విడత గుడ్లను పెడుతుంటాయి. అలాగే దోమల్లో ఆడ దోమలే ఇలా కుడుతుంటాయి. ఆడ దోమలు నెల రోజుల వరకూ జీవిస్తాయి. అయితే కేవలం ఎనిమిది నుండి తొమ్మిది రోజులు మాత్రమే బ్రతుకుతాయి.





# పుస్తక పరిచయం — భూంపాప పాటలు

కొన్ని సత్యాలను జీవితాంతం గుర్తించుకోవాల్సి ఉంటుంది. వీనిని జీవిత సత్యాలు అంటాం. ఈ విషయాలను చిన్నతనంలోనే పాటల ద్వారా నేర్చుకుంటే అవి జీవితాంతం గుర్తిండి, ఎంతో ఉపయోగపడతాయి. దీన్నే గమనంలో ఉంచుకొని భూపాల్ రచయిత గారు ఎన్నో విషయాలను పాటల రూపంలో పిల్లలు నేర్చుకొనేలా రాశారు. వీనిని ఆంధ్రజ్యోతి దిన పత్రిక గతంలో ప్రచురించింది. ఇప్పుడు ఈ పాటలనే "భూంపాప పాటలు - ఆడుతూ పాడుతూ వికసించు పాప" అనే పేరుతో పుస్తక రూపంలో అరిబండి బాలసాహిత్యం ట్రస్ట్ ప్రచురించింది.




మహబూబ్‌నగర్ జిల్లాలో సీతాకోక చిలుకలను 'భూంపాపలు' గా పిలుస్తారు. గెంతుతూ, పరుగెత్తుతూ ఎగిరే సీతాకోక చిలుకలను పట్టుకుంటే పిల్లలకు వచ్చే ఆనందం మాటల్లో వర్ణించడం కష్టం. సీతాకోక చిలుకలను పట్టుకున్నప్పుడు వచ్చే ఆనందం లాగా జీవితాంతం గుర్తుపెట్టుకోవాల్సి విషయాల్ని పాటల రూపంలో నేర్చుకొని ఆనందించేలా రాశారు భూపాల్.

భూపాల్ ఎంతో అనుభవం గల రచయిత. ప్రత్యేకంగా పిల్లలకై ఎన్నో పుస్తకాలను రాశారు. వీరు రాసిన 'చదువు కోరిక' 5వ తరగతి తెలుగు వాచకంలో పాఠంగా చేర్చబడింది.

ప్రతి పాటలో పల్లవితో సహా కేవలం నాలుగు చరణాలే ఉండటం ఈ పాటల ప్రత్యేకత. ప్రతి పాటలో ఒకే ఒక అంశం ఉంటుంది. ఎంతో విలువైన జీవిత సత్యం ఒక పాటలో ఎలా చెప్పబడిందో చూడండి!

**"ఎట్ల? ఎప్పుడు? ఎందు?**
**తెలుసుకో అవి ముందు**
**ఇట్లె జ్ఞానము పొందు....**
**ఓ చిట్టి పాప.....**

ఇలా ప్రతి పాటలో జీవితాంతం గుర్తుపెట్టుకోవాల్సిన ఏదో ఒక అంశం చెప్పబడింది. పెరుగుతున్న పిల్లలు ముద్దు ముద్దు మాటలతో ఈ పాటలను నేర్చుకోవడం చాలా తేలిక. ఈ పుస్తకంలో ఇలాంటివి 132 పాటలు ఉన్నాయి. వీనిలో 33 పాటలకు తన చిత్రాలతో చిత్రకారుడు శివాజీ జీవం పోశాడు. ప్రతి బాలుడు ఈ పుస్తకంలోని పాటలను చదివి నేర్చుకోవాల్సిన అవసరం ఉన్నది. అరిబండి బాలసాహిత్యం ట్రస్టుచే ప్రచురించబడ్డ ఈ 42 + 4 పేజీల పుస్తకం వెల రు. 25/-. ప్రజాశక్తి బుక్‌హౌస్ అన్ని బుక్‌షాపులలో ఈ పుస్తకం దొరుకుతుంది.



# నాన్నల దినోత్సవం



ప్రతి సంవత్సరం జూన్ నెల మూడవ ఆదివారం రోజున నాన్నల దినోత్సవాన్ని జరుపుతున్నారు.

మన పుట్టుకకు, మంచి చెడ్డలు చూసే దానిలో అమ్మ, నాన్నలే ప్రధాన పాత్ర వహిస్తున్నారు. మనపై వారు చూపించే ప్రేమ సాటిలేనిది. పోల్చలేనిది. వారు పిల్లల్ని పెంచడానికి ఎంత కష్టన్నైనా సంతోషంగా భరిస్తారు. శక్తిమేర పిల్లల్ని పెంచి, చదివించి పెద్ద చేస్తారు. పెరిగి పెద్దైన పిల్లల్ని చూసి ఆనందిస్తారు. పిల్లలు సాధించిన ప్రతి విజయాన్ని చూసి గర్వస్తారు. అటువంటి అమ్మ, నాన్నలు స్వయంగా పెద్దైన తరువాత కూడా వారిని గౌరవిస్తూ, వారి అవసరాల బాధ్యతను పిల్లలు తీసుకోవాలి. ఈ బాధ్యతను గుర్తు చేయడానికే అమ్మ, నాన్నల దినోత్సవాలు ప్రవేశపెట్ట బడ్డాయి. జూన్ మూడవ ఆదివారం నాడు నాన్నల దినోత్సవాన్ని జరుపుతున్నారు. అమ్మ దినోత్సవాన్ని ప్రతి సంవత్సరం మే నెల 2వ ఆదివారం నాడు జరుపుకుంటున్నారని తెలుసు కదా?

పశ్చిమ దేశాల్లో, యూరోప్‌లో ఈ ఉత్సవాల్ని అందరూ చేస్తారు. మనం తల్లిదండ్రులతో కలిసి ఒకే కుటుంబంలో ఉండడానికి అలవాటు పడ్డాం. కాని వివిధ కారణాలవల్ల పెరిగి పెద్దైన ఇప్పటి పిల్లలు తల్లిదండ్రులకు దూరంగా ఉంటున్నారు. అటువంటి వారికి ఈ అమ్మ, నాన్నల దినోత్సవాలు వయస్సు మీరిన తల్లిదండ్రుల యెడల ఉన్న బాధ్యతలను గుర్తు చేస్తాయి.

ఈ నెల జూన్ 15న నాన్నలకు శుభాకాంక్షలు తెలుపండి. అమ్మ, నాన్నల అవసరాల గురించి ఆలోచించండి. అవసరమైన మేర వీనిని తీర్చడం మన కర్తవ్యం.







# కోడిపిల్ల బావుందా!

- క్రాంతి

**హా**య్ ఫ్రెండ్స్! ఎలా ఉన్నారు? వేసవి సెలవులు ఇట్లా వచ్చి అట్లా అయిపోతున్నాయి కదూ. 'అరరే.... మళ్లీ బళ్లు తెరిచేస్తున్నారు? మళ్లీ చదువుల కష్టాలు మొదలు' అని అనుకుంటున్నారా? అలా అనుకోవద్దు. ఎందుకంటే... మనం బడి బయట ఎంత నేర్చుకుంటామో బళ్లో కూడా అంతే నేర్చుకుంటాం. కాబట్టి బడిని తిట్టుకోవద్దు. ఇక మీదట కొత్త తరగతి, కొత్త పుస్తకాలు, కొత్త పాఠాలు, కొత్త స్నేహితులు, కొత్త మాష్టార్లు చెప్పే కొత్త కొత్త సంగతులు.... అబ్బో.... అన్నీ కొత్తే. మరి అంతా కొత్తదనం. రోజూ సెలువులు తీసుకుంటే బాగుంటుందా? బాగుండదు. కాబట్టి బుద్ధిగా బడికెళ్లండి. మాష్టార్లు చెప్పే పాఠాల్ని చక్కగా విని, అర్థం చేసుకోండి. మంచి పిల్లల్లా మెసలండి. సరేనా! ఇక అసలు విషయానికొద్దాం. ఇవాళ మేం మీకు నేర్పబోయేది ఏంటో తెలుసా? కోడిపిల్ల బొమ్మని తయారుచేయడం. మరి నేర్చుకుంటారా!





ఇప్పుడు కోడిపిల్ల శరీరం అనుకున్న వృత్తాకారంలో వున్న భాగాన్ని తీసుకోండి. దానికి పైన, కింద పెన్సిల్‌తో గీత గీసి గుర్తించండి. పై వైపున అటూ ఇటూ రెక్కలు అంటించాలి. కిందవైపున కాళ్లు (కాగితం ముక్కలే సుమా!) అంటించాలి. పిన్నులు వుంటే పెన్సిల్‌తో గీసి గుర్తించన ప్రదేశంలో రంధ్రాలు చేసి, పిన్నుల సాయంతో రెక్కలు, కాళ్లను అమర్చండి (2వ బొమ్మ). లేదంటే

### ఏమేం కావాలి?

రెండు రంగుల చార్టులు, పెన్సిల్, రబ్బరు, కత్తెర, బంక లేదా పిన్నులు.

### ఎలా చేయాలి?

ముందు ఒక చార్టు మీద మొదటి బొమ్మలో చూపించిన విధంగా పెన్సిల్‌తో గీయండి. వీటిలో మధ్యలో వున్న కోడిపిల్ల శరీరమైతే, పక్కన వున్న రెండు చిన్న అర్ధవృత్తాలు దాని రెక్కలన్నమాట. ఇంకో చార్టు మీద కాళ్లు, మూతిలా గీయండి (ఇవి కూడా మొదటి బొమ్మలోనే ఉన్నాయి). ఇప్పుడు కత్తెర తీసుకోండి. దీని సాయంతో జాగ్రత్తగా పెన్సిల్ అంచుల చుట్టూ కత్తిరించండి.



బంకతోనూ పని పూర్తి చెయ్యెచ్చు. చివరిగా ముక్కు భాగాన్ని రెండు రెక్కల మధ్యలో అంటించండి (3వ బొమ్మ). ఇప్పుడు చూడండి. కోడిపిల్లలా అనిపించట్లేదు. దీన్ని మీ గదిలో గోడకు తగిలించవచ్చు. లేదంటే కాస్త గట్టిగా వున్న కాగితం మీద దీని పెట్టి అంటించండి. ఆ కాగితానికి అటూ ఇటూ రంధ్రాలు చేసి, దారంతో ముడేయండి. ఇప్పుడు ఆ దారం సాయంతో గోడకు వేలాడదీయండి. కోడిపిల్ల ఫొటో ఫ్రేమ్ రెడీ.









# పులి పిల్ల

- రమ

"అబ్రకదబ్రా.... దబ్రకఅబ్రా.... హాం... ఫట్.... చూడండి..... ఈ పిల్లవాడు ఎలా మాయమయ్యాడో.... మీరే చూడండి...." చుట్టూ వున్న జనాన్ని ఉద్దేశించి బిగ్గరగా అరిచాడు మెజీషియన్ మహేష్.

"అరే.... ఇప్పటిదాకా ఆ బల్ల మీద పడుకున్న వాడు ఏమయ్యాడు? ఎక్కడికెళ్లిపోయాడు?!" ఆశ్చర్యంగా తమలో తామే అనుకోసాగారు చుట్టూ చేరిన పిల్లలంతా.

"ఇప్పుడు మళ్లీ.... ఆ అబ్బాయిని రప్పిస్తాను. మీ కళ్లతో మీరే చూడండి.... అబ్రకదబ్రా.... దబ్రకఅబ్రా... అబ్బాయీ... మళ్లీ వచ్చి పడుకో" చేతిలో వున్న కర్రను విచిత్రంగా గాల్లో తిప్పుతూ మళ్లీ అరిచాడు మహేష్. మరుక్షణంలో అతని ముందున్న బల్ల మీద పిల్లవాడు ప్రత్యక్షమయ్యాడు. అది చూసి పిల్లలంతా ఆనందంతో కేరింతలు కొట్టారు.

"ఇప్పుడు మీకు మరో వింత చూపిస్తాను. చూడండి.... నా టోపీలో ఏమైనా ఉందా? బాగా చూడండి. ఏమీ లేదు కదూ. ఇప్పుడు ఈ ఖాళీ టోపీల నుండి ఓ కుందేలు పిల్లను బయటకు తెప్పిస్తాను. కళ్లార్పకుండా చూస్తూనే ఉండండి. సరేనా...." అంటూ టోపీని తల మీద పెట్టుకొని తన చేతిలోని కర్రను అటూ ఇటూ తిప్పాడు. తర్వాత టోపీ తీసి, అందులో వున్న కుందేలు పిల్లను బయటకు తీశాడు.

పిల్లలంతా ఆశ్చర్యంలో తల మునకలయ్యారు. పెద్దగా చప్పట్లు కొడూతూ తమ హర్షధ్వానాలు తెలియజేశారు. ఇలా



పిల్లలు కేరింతలతో మ్యాజిక్ షో నిరాటంకంగా సాగిపోతోంది. పార్కులో అక్కడక్కడ కూర్చున్న పెద్దవాళ్లు కూడా మ్యాజిక్ షో దగ్గరకు వచ్చి చేరుతున్నారు. కాసేపట్లోనే అక్కడి వాతావరణమంతా మరింత కోలాహలంగా మారింది.

ఈ సందట్లో చెట్ల చాటున దాకున్న పులిని ఎవరూ గమనించలేదు. అది దగ్గర్లోని జంతు ప్రదర్శనశాల (జూ) నుండి పారిపోయి వచ్చింది. బాగా ఆకలి మీద వున్న పులి. ఆహారం కోసం వెతకసాగింది. కానీ అంతమంది జనం మధ్యకు వెళ్లాలంటే దానికి భయంగా ఉంది. అదే సమయంలో ఇందాక మెజీషియన్ మహేష్ టోపీలో నుండి కుందేలు పిల్లను తెప్పించడం దానికి బాగా నచ్చింది.



మహేష్‌ని భయపెట్టో బతిమాలో ఈ పూటకు ఒక కుందేలు పిల్లను ఆహారంగా సంపాదించుకోవాలనుకుంది పులి. అందుకే చెట్ల గుబుర్లలో మరింతగా ఒదిగి కూర్చుంది. మరో గంట తర్వాత మహేష్ మ్యాజిక్ షో ముగిసింది. పార్కులో జనం అలికిడి కూడా సద్దుమణిగింది. మహేష్ తన సరంజామా అంతా సర్దుకొని పార్కు ముఖద్వారం వైపు నడవసాగాడు. ఇంతలో అతని ముందు పులి ప్రత్యక్షమైంది.

ఒక్కసారిగా తన ముందుకొచ్చి నిలిచిన పులిని చూడగానే మహేష్ హడలిపోయాడు. అతనికి ముచ్చెమటలుపట్టాయి. సాయం కోసం అరుద్దామని చుట్టూ చూశాడు. చుట్టూ నరమానవుడు కూడా కనిపించలేదు.

"అప్పుడే అందరూ వెళ్లిపోయారా? అయ్య బాబోయ్.... పులి.... దీని బారి నుండి బయటపడడమెలా?'' అని తీవ్రంగా ఆలోచించసాగాడు మహేష్.

"నువ్వేం భయపడకు. నేను నిన్నేమీ చేయను. నాక్కావాల్సిందిస్తే వెళ్లిపోతాను" గంభీరంగా అంది పులి.

ఆ మాటలకు మహేష్ ఆశ్చర్యపోయాడు. "ఏం.... ఏం....కావాలి?" అని తత్తరపడుతూ అడిగాడు మహేష్.

"నాకు బాగా ఆకలిగా ఉంది. నాకు ఒక కుందేలును ఇవ్వు. దాన్ని తిని వెళ్లిపోతాను" చెప్పింది పులి.

"కుందేలా? నా దగ్గర ఎక్కడిది?'' ధైర్యాన్ని కూడదీసుకుంటూ బదులిచ్చాడు మహేష్.

"ఇందాక అంతమంది ముందు టోపీలో నుండి కుందేలు పిల్లను తీసిచ్చావు కదా. అలాగే నాకూ ఓ కుందేలు పిల్లనివ్వు" చెప్పింది పులి.

అప్పటికి మహేష్ కాస్త స్థిమితపడ్డాడు. "అదా.... ముందుగానే నేను కుందేలు పిల్లను నా దగ్గరపెట్టుకొని అలా మ్యాజిక్ చేశానంతే...." అని అన్నాడు.

"అయితే నిజంగా నీ దగ్గర కుందేలు లేదా?" అడిగింది పులి.

"ఇందాక ఓ బుజ్జి పాప చాలా ముద్దుగా అనిపిస్తే నా దగ్గర వున్న ఒక్క



కుందేలు పిల్లనీ ఆ పాపకే బహుమతిగా ఇచ్చేశాను. ఇప్పుడు నా దగ్గర ఏమీలేవు" చెప్పాడు మహేష్.

"అయితే ఈసారి వచ్చేటప్పుడు నాకోసం ఓ పులి పిల్లను పట్టుకురా. దాన్ని నేను పెంచుకుంటాను" చెప్పింది పులి.

"పులి పిల్లే. నన్ను పట్టుకొని జైల్లో వేస్తారమ్మా తల్లీ. నన్నొదిలెయ్...." చేతులెత్తి మొక్కుతూ అన్నాడు మహేష్.

"నిన్ను వదలనంటే వదలను. మళ్లీ ఇక్కడికొస్తావుగా. అప్పుడు నీ అంతుచూస్తాను" బెదిరించింది పులి.

"నన్నేమీ చేయకు. కావాలంటే నెల రోజులు ఆగు. చచ్చీచెడైనా సరే. నీ కోసం ఓ పులి పిల్లను తీసుకొస్తాను" చెప్పాడు మహేష్.



"నీ మాట నమ్మమంటావా?" సందేహంగా అడిగింది పులి.

"నమ్మి తీరాలి" స్థిరంగా అన్నాడు మహేష్.

"అయితే వెళ్లు. నెల రోజుల తర్వాత పులి పిల్లతో కనిపించు" అంది పులి.

"కానీ ఒక్క షరతు...." సందేహిస్తూనే అన్నాడు మహేష్.

"ఏంటది?" అడిగింది పులి.

"ఈ నెల రోజులు నువ్వే మాంసాహారం తినకూడదు. పాలు, అన్నం మాత్రమే తినాలి. లేదంటే నేను పులి పిల్లను తెచ్చివ్వను" చెప్పాడు మహేష్.

"సరే అలాగే చేస్తాను" మాటిచ్చింది పులి. మహేష్ 'బతుకుజీవుడా!' అనుకుంటూ అక్కడి నుండి బయటపడ్డాడు.

నెల రోజులు గడిచాయి. అన్న మాట ప్రకారం మహేష్ ఆ రోజు సాయంత్రం పార్కుకు వచ్చాడు. పులి జనాలు ఎవరికీ కనిపించకుండా అక్కడికొచ్చి, మహేష్‌ని కలుసుకుంది. పులి పిల్లను ఇవ్వమని తొందరపెట్టింది.

అందుకు మహేష్, "ఇన్ని రోజులు ఓపికపట్టావు. ఇంకొక్క గంట ఓపిక పట్టు. ఈలోగా జనం కూడా వస్తారు. వాళ్ల ముందు మ్యాజిక్ చేసి, నేను నీకు పులి పిల్లను ఇస్తాను. వాళ్లు నిన్నేమీ చేయరు. పైగా సంతోషిస్తారు. నాకూ మంచి పేరొస్తుంది" అన్నాడు.

"సరే.... నా కోసం శ్రమపడి పులి పిల్లను పట్టుకొచ్చావు. నీ [illegible]ర్తికి [illegible]నెందుకు అడ్డురావాలి. అలాగే ఆగ[illegible]" అంది పులి. గంట గడిచింది. పార[illegible] జనం సందడి మొదలైంది. మహేష్ మ్యాజిక్ షో మొదలుపెట్టాడు. పులి వచ్చి వేదిక దగ్గరగా కూర్చుంది. అది విన్యాసంలో భాగంగా వచ్చిందనుకున్నారంతా. దాన్ని ఎవరూ కదిలించలేదు. దాన్ని చూసి భయపడనూలేదు. అది పులికి కించిత్తు బాధ కలిగించింది. అయినా ఎవర్నీ ఏమీ అనలేదు. మ్యాజిక్ షో మొదలైంది. మహేష్ ఒక్కొక్క మ్యాజిక్ ప్రదర్శిస్తున్నాడు. చివరిగా,





"ఇప్పుడు నేను టోపీలో నుండి ఈ పులి కుటుంబానికి చెందిన ఓ బుజ్జి జంతువును బయటకు తీస్తాను. మీరంతా జాగ్రత్తగా గమనిస్తూ ఉండండి" అన్నాడు మహేష్.

"అబ్రకదబ్రా... దబ్రకఅబ్రా...." అని మంత్రాలు చదువుతూ తల మీద వున్న టోపీ తీశాడు.

"పిల్లి పిల్ల.... పిల్లి పిల్ల...." అంటూ పిల్లలంతా కేరింతలు కొట్టారు. పులికి బాగా కోపమొచ్చింది. పులి పిల్లను తెస్తానని చెప్పి పిల్లి పిల్లను తెచ్చిన మహేష్ మీదకు ఉరకాలనుకుంది. కేరింతలు కొడ్తున్న వాళ్లందర్నీ హడలుగొట్టాలనుకుంది. నోరు పెద్దగా తెరిచి గాండ్రించింది. అయితే నెల రోజుల నుండి సరైన ఆహారం లేకపోవడం మూలాన పులి బాగా నీరసించిపోయింది. దాంతో దాని నోటి నుండి గాండ్రింపుకు బదులు 'మ్యా....వ్.....' మన్న శబ్దం వచ్చింది. అది విని జనం ఘొల్లున నవ్వారు.

పులికి బాగా అవమానంగా తోచింది. వెంటనే అక్కడి నుండి పరుగందుకుంది. అయితే.... అక్కడికి దగ్గర్లోనే కాపుకాసి వున్న జంతు ప్రదర్శనశాల అధికారులు దాన్ని పట్టుకున్నారు. పులిని తీసుకెళ్లి జూలో పెట్టారు. నెల రోజుల నుండి తప్పించుకు తిరుగుతున్న పులిని పట్టిచ్చినందుకు మహేష్‌ని మెచ్చుకున్నారంతా. బహుమతిని కూడా ఇచ్చారు.

## అంతర్జాతీయ బాలల దినోత్సవం

ప్రపంచంలోని అన్ని దేశాలు జూన్ 1వ రోజును అంతర్జాతీయ బాలల దినోత్సవంగా జరుపుతున్నాయి. దాదాపు 100 దేశాలు ఈ రోజున బాలల దినోత్సవాలను జరుపుతున్నాయి. మన దేశంలో మాత్రం మన మొదటి ప్రధానమంత్రి జవాహర్‌లాల్ నెహ్రూ పుట్టిన రోజైన నవంబర్ 14న బాలల దినోత్సవాన్ని జరుపుకుంటున్నాం.

బాలలు మన జాతి సంపద. వీరిని ఆరోగ్యంగా పెంచి పెద్ద చేయడం, చదివించడం మనందరి బాధ్యత. మన ప్రతినిధిగా ఇది మన ప్రభుత్వ బాధ్యత. బాలల గరిష్ట అభివృద్ధికి రాజ్యాంగంలో నిర్దేశించినట్లుగా ఆటంకం, వివక్ష లేని పెంపకాన్ని అందించడం మన జాతి కర్తవ్యం. కాని, దురదృష్టంగా బాలల పెంపకంలో ఎంతో వివక్ష వచ్చి చేరింది. పేద కుటుంబాల బాలలకు అవసరమైన పోషక ఆహారం, ఆరోగ్యం, బట్టలు, చదువు అందడంలేదు. ఇంకా లక్షల మంది బాలలు బాల కార్మికులుగా పని చేసే దుస్థితి కొనసాగుతుంది. దీన్ని సవరించాల్సిన అవసరం ఉంది. దీన్ని గురించి ఆలోచించి పరిష్కరించడానికి ప్రయత్నించాలి. అప్పుడే బాలల దినోత్సవ లక్ష్యం నేరవేరుతుంది.







# మంత్రి కావలెను!

- జంధ్యాల శ్రీకరుణ

**కృ**ష్ణగిరి రాజ్యానికి రాజు సూరసేనుడు. మంచి రాజుగా పేరు గడించాడు. అతని పాలన బాగా ఉందంటే అందుకు మంత్రి వీరవర్మ సలహాలే కారణమని అందరూ చెబుతుంటారు.

అనారోగ్య కారణాలవల్ల నేను మంత్రి పదవి నుండి తప్పుకుంటాను అని రాజుతో వీరవర్మ ఓనాడు మొర పెట్టుకున్నాడు. అయిష్టంగానైనా ఈ ప్రతిపాదనకు రాజు ఒప్పుకున్నాడు. అదీ ఓ షరతుకు కట్టుబడి! అదేమంటే కొత్తమంత్రిని ఎంపికచేసే బాధ్యత వీరవర్మదే! ఇక ఏమాత్రం జాప్యం చేయకుండా కొత్తమంత్రి వేటలో పడ్డాడు వీరవర్మ.

అందుకోసం రాజ్యంలోని అన్ని పట్టణాలు, పల్లెలకు సమాచారం పంపించారు. అర్థశాస్త్రం, రాజనీతి శాస్త్రం బాగా తెలిసిన యువకులు రాజువద్ద అతి సన్నిహితంగా పని చేయుటకు దరఖాస్తు చేసుకోవచ్చునని, వారికి విలువిద్య, కత్తియుద్ధం, గుర్రపు స్వారీ లాంటి యుద్ధకళలు కూడా వచ్చివుండాలని చాటింపు వేయించాడు మంత్రి.

రాజ్యం నలుమూలలనుండి దరఖాస్తులు అందాయి. దరఖాస్తుదారులందరినీ మంత్రివర్యులు, సేనాధిపతిలు కలిసి వివిధ పరీక్షలకు పెట్టిన ఓ అయిదుగురిని అర్హులుగా గుర్తించారు. వారు



విక్రముడు, సందీపుడు, సమరసేనుడు, అనంతసేనుడు, రవివర్మ చివరకు వీరందరిలో ఒకరినే ఎంపిక చేయాలి.

ఈ అయిదుగురిని రెండు నెలలపాటు వివిధ విద్యల్లోనూ; రాజనీతి, అర్థశాస్త్రాలకు సంబంధించిన వివిధ రకాల చర్చల్లోనూ పరీక్షించారు. ఎటువంటి పరీక్ష ఎదురయినా నువ్వా, నేనా అన్న రీతిలో ఈ అయిదుగురూ దూసుకెళుతున్నారు. స్వయంగా రాజు సూరసేనుడు రంగంలోకి దిగినా అయిదుగురిలో ఏ ఒక్కడినీ అధికునిగా గుర్తించలేక పోయారు.

చివరి ప్రయత్నంగా ఈ అయిదుగురినీ రాజధానికి 50 మైళ్ళ దూరాన గల కందీనపురి అగ్రహారానికి తీసుకెళ్ళారు. ఆ రోజు అక్కడే సేదతీరే ఏర్పాట్లు చేశారు. మరునటి రోజు తెల్లవారకముందే మేల్కొని రాజధానికి ఉదయం 8 గంటలకు లేదా ఆలోపే చేరుకోవాలి. 8 గంటల తరువాత ఒక్క నిముషం ఆలశ్యమైనా అక్కడ జరిగే చివరి పరీక్షలో పాల్గొనటానికి అవకాశం కోల్పోతారు. ఇది రాజాజ్ఞ.



మరుసటి రోజు తెల్లవారకముందే అయిదుగురూ లేచి కాలకృత్యాలు తీర్చుకొని కోనేటిలో స్నానం చేసి రాజధానివైపు తమ తమ అశ్వాలపై పయనమయ్యారు. గత రెండు నెలల్లోనూ వీరు మంచి మిత్రులైపోయారు. వివిధ విషయాలు మాట్లాడుతూ రాజధానివైపు దౌడుతీయసాగారు. తెలవారుతుండగా ఎర్రని సూర్యకాంతిలో గుర్రాలు పరిగెడుతున్నాయి.

వారలావెళుతూవుండగా అరణ్యగిరి అనే ఊరివద్ద జనం గుమికూడి వుండటం కనిపించింది. అడవిలోనికి వెళ్ళిన ఓ నడివయసు వ్యక్తిని ఓ ఎలుగుబంటి తీవ్రంగా గాయపరచింది. అక్కడేవున్న నాటువైద్యుడు పసర్లు అవీ పూశాడు కాని గాయాల్లోంచి రక్తం బాగా కారుతోంది. రాజధానికి తీసుకెళితే తప్ప మంచి వైద్యం లభించదని అందరు అంటున్నారు. ఈ అయిదుగురిని చూసిన గ్రామ ప్రజలు గాయపడిన వ్యక్తిని రాజధాని చేర్చవలసిందిగా వేడుకున్నారు. అయిదుగురూ సందిగ్ధంలో పడ్డారు. గాయపడ్డ వ్యక్తిని జాగ్రత్తగా తీసికెళ్ళాలి కాబట్టి రాజు చెప్పిన పరీక్షా సమయానికి రాజధాని చేరుకోలేరు. అక్కడికి వెళ్ళిన మరుక్షణం మంచివైద్యుల్ని పంపుదామని విక్రముడు, అనంతసేనుడు, సమరసేనుడు, రవివర్మ ఒక నిర్ణయానికివచ్చారు. సందీపుడు మాత్రం గాయపడిన వ్యక్తిని తన గుర్రంపై తెస్తానని తక్కిన నలుగురూ వెళ్ళవలసిందిగా కోరాడు. తాను పరీక్షా సమయానికి రానందుకు తనను రాజు క్షమించవలసిందిగా తన మిత్రులచే వర్తమానం పంపాడు. అతడి మొండి పట్టు చూసిన మిత్రులు చేసేది లేక పయనమైనారు.

సందీపుడు గాయపడిన వ్యక్తిని అతి జాగ్రత్తగా గుర్రం మీద పెట్టుకొని స్వారీ చేస్తూ అక్కడక్కడా అతడికి నీరు తాపుతూ రాజధాని

వైపు తన ప్రయాణం కొనసాగించాడు.

అటు రాజధానికి చేరిన నలుగురూ రాజు చెప్పిన సమయానికంటే ముందే రాజప్రాసాదం చేరుకున్నారు. సరిగ్గా 8 గం॥లకు ఓ సైనికుడు వచ్చి రాజు, మంత్రి ముఖ్యమైన చర్చల్లో వున్నందున ఒక గంట వేచి వుండాలని చెప్పి వెళ్ళాడు.

సరిగ్గా 9 గంటలవుతుండగా రక్తపు మరకలైన వస్త్రాలతో సందీపుడు రాజప్రాసాదం చేరుకున్నాడు. నలుగురూ అతణ్ణి పరామర్శించి గాయపడిన వ్యక్తి గురించి వాకబు చేశారు. రాజ వైద్యులకు అప్పగించివచ్చానని, అతడికే ప్రమాదం లేదని సందీపుడు సమాధానమిచ్చాడు. నలుగురూ అతణ్ణి మనసారా అభినందించారు. ఒక గంట అదనంగా సమయం లభించినందుకు సందీపుడు కూడా పరీక్షకు రాగలిగాడని ఆనందించారు.

మంత్రివర్యులు ఈ అయిదుగురినీ ఓ గదిలోకి ఆహ్వానించాడు. "ఇది మీ చివరి పరీక్ష. ఖచ్చితంగా మీలో ఒక్కరుమాత్రమే నెగ్గుకురాగల పరీక్ష యిది" అని మంత్రి గది తలుపులు తీశాడు. సందీపుడితో సహా అయిదుగురూ ఆశ్చర్యపోయారు. ఎదురుగా ఎలుగుబంటి చేతిలోగాయపడిన వ్యక్తి నవ్వుతూ నిలుచున్నాడు. మంత్రివర్యులు ఆ వ్యక్తికేసి చూసి "నమస్కారం మహారాజా" అని అభివాదం చేశాడు. ఆశ్చర్యంగా యీ అయిదుగురూ రాజుకు అభివాదం చేశారు.

రాజు వారినుద్దేశించి ఇలా అన్నాడు. "గాయపడిన వ్యక్తిని చూసి మీ అయిదుగురూ చలించిపోయారు. ఒక్క సందీపుడు మాత్రం తనకు వ్యక్తిగతంగా నష్టం జరిగినాసరే ఒక వ్యక్తి ప్రాణం ముఖ్యమని భావించి సాహసం చేశాడు. మానవత్వంతో గాయపడిన వ్యక్తికి సహాయం చేశాడు. పరీక్షకు రాలేనందుకు రాజుకు క్షమాపణలు కూడా చెప్పమన్నాడు. రాజధాని చేరేవరకూ నన్ను గాయపడిన వ్యక్తిగా భావించి అన్ని సపర్యలు చేశాడు. చాలా జాగ్రత్తగా ప్రయాణం కొనసాగించాడు. నా మనసు చలించిపోయింది. వీరవర్మగారు రచించిన చివరి పరీక్షలో సందీపుడు నెగ్గాడు. అందుకే అతని తర్వాత సందీపుణ్ణి మంత్రిగా నియమిస్తున్నాను" అని సందీపుడివైపు అభినందన పూర్వకంగా చూశాడు. వీరవర్మ వైపు కూడా గౌరవంగా చూశాడు. "తక్కిన నలుగురూ కూడా ఇక్కడికి వచ్చిన సందీపుణ్ణి అడిగిన మొదటి ప్రశ్న గాయపడిన వ్యక్తి గురించే! ఆలశ్యమైనా అతను పరీక్షకు వచ్చినందుకు ఆనందించారు కూడా. వారూ కూడా నన్ను కదిలించారు. అందుకే వారిని కూడా నా ఆస్థానంలో తగిన ఉద్యోగాలిచ్చి గౌరవిస్తాను" అని ముగించాడు రాజు సూరసేనుడు.

అందరూ నూతన మంత్రిగా ఎంపికైన సందీపుణ్ణి అభినందించారు.



# బాల్యం బావురుమంటోంది

ఆరింటికి అలారం మ్రోగింది
అలసి సొలసిన చిన్నారికి మత్తు వదల్లేదు
అమ్మవచ్చి దుప్పటిలాగి కూర్చోబెట్టింది
అలా నిద్రకళ్ళతోటే బాత్‌రూం ప్రవేశం

ఏం చేసినా కాలానికి కళ్ళెం వేయలేం
గుర్రంలా పరుగెడుతుందీ కాలచక్రం
అతి కష్టం మీద ఎనిమిదింటికి రెడీ!
అల్పాహారం ఆరగించేసరికి ఎనిమిదిన్నర

స్కూలు బస్సుకై ఎదురు చూపులు
రైల్వే బోగీలో లగేజీలా బస్సులో కూలడం
స్కూలు చేరే సరికి ఎనిమిది యాభై
ప్రార్థనతో ప్రారంభం చదువులయజ్ఞం

తొమ్మిది నుంచి తోముతారు నిర్దాక్షిణ్యంగా
చిన్నారి మనసులను స్కూలు రికార్డులకై
అదిమి నలిపేస్తారు అన్యాయంగా
ఏడు కొట్టేవరకు ఏకబిగిన

ఇల్లు చేరేసరికి ఏడున్నర
కొంచెం ఫ్రెష్ అయ్యేసరికి ఎనిమిది
ఆనందంగా టి.వి. చూద్దామనుకుంటే
అమ్మ అరుపు చదువుకోమని

ఈ పెద్దవాళ్ళు ఎందుకిలా అవుతారు?
మాకూ మనసుంటుందని ఎందుకనుకోరు?
మనోవికాసానికి, ఆహ్లాదానికి ఏముంది
మాకు?

గానుగెద్దుల్లా చదువు బండి లాగాలి

అమ్మ ఆప్యాయత, నాన్న మమకారం
మరచిపోయి చాలా కాలమయ్యింది
ఏ కొద్ది సమయం విశ్రాంతిగా కూర్చున్నా
అమ్మ అరుపులు, నాన్నకేకలు చదువుకోమని

ఆడుకోనీయరు సరదాగా
స్నేహితులతో కబుర్లు చెప్పుకోనీరు
ఎంతసేపూ చదువు చదువు
మేమేమన్నా చదువుల యంత్రాలమా?
అందుకే
మా బాల్యం బావురుమంటుంది
మరో తిలక్, గాంధీజీలు రాకపోతారా?
మా బాల్యం మారకపోతుందా అని
ఎదురు చూస్తున్నాం! ఎంతో కాలంగా

**- చేంబర్లైన్**

## గుడ్డు

అండమంటే
గుడ్డురా!
ప్రోటీన్లు విటమిన్లు
ఫాటు ఉండురా!
పిల్లలకది బెస్టురా!

**- విప్లవ్ దత్ శుక్లా**






# తెలుగు సాహిత్య వెలుగు పతాకం - శ్రీశ్రీ



- వొరప్రసాద్

హాయ్ ఫ్రెండ్స్,

"తెలుగు వీర లేవరా! దీక్షబూని సాగరా!" అనే పాట విన్నారా? లేకపోతే "ఎవరో వస్తారని, ఏదో చేస్తారని, ఎదురు చూసి మోసపోకుమా! నిజము మరిచి నిదుర పోకుమా?" పాటైనా విన్నారా? వినే వుంటారు! ఇంకా ఇలాంటి మంచి పాటలు ఉత్తేజం కలిగించేవి ఎన్నో వున్నాయి. అంతేగాక "ఏ చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం, నరజాతి చరిత్ర సమస్తం పరపీడన పరాయణత్వం", "నేను సైతం ప్రపంచాగ్నికి సమిధ నొక్కటి ఆహుతిచ్చాను" వంటి కవిత్వ చరణాలు- ఇవన్నీ రాసిన అతను ఎవరై వుంటారు! ఆలోచించండి! ఇంకెవరు?! మహాకవి శ్రీశ్రీ గా పేరొందిన శ్రీరంగం శ్రీనివాసరావు.

సామాన్య ప్రజలకు అర్థం కాని సంస్కృత శ్లోకాలూ, పద్యాలతో తెలుగు పండితులు గొప్పలు చెప్పుకునేవారు. ఎవరైనా తెలుగులో ఏమైనా రాయాలంటే అర్థం కాని దీర్ఘసమాసాలూ, కష్టంగా ఉండే సంస్కృత పదాలూ తమ రచనలో ఉండేలా జాగ్రత్త పడేవారు. అంతేగాకుండా ఆ రాసినవి కూడా రాజుల గొప్పలు గురించి, దేవుళ్ళ మహాత్యాల గురించి తప్ప సమాజం గురించి, ప్రజల గురించి ఉండేవి కాదు. ఇవి ప్రజల అజ్ఞానాన్ని, మూఢనమ్మకాల్ని పెంచేవి. అలాంటి కాలంలో భాష అనేది ప్రజల వికాసానికి ఉపయోగపడాలని, అలాగే రచనలనేవి ప్రజలను నిద్ర పుచ్చేటందుకు కాకుండా చైతన్యం కలిగించేలా ఉండాలని చాటి చెప్పినవాడు - శ్రీశ్రీ. తను రాసిన ప్రసిద్ధ కవితా సంపుటి 'మహా ప్రస్థానం' లోని కవితలన్నీ కూడా అలాంటివే. 'తాజ్ మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?/ ప్రభువెక్కిన పల్లకి కాదోయ్/అది మోసిన బోయీలెవ్వరు?" అంటూ రంగ ప్రవేశం చేసి తన కవిత్వంతో తెలుగుప్రజలలో సంచలనం రేకెత్తించాడు. అప్పటి వరకూ పద్యాల రాగాలతో గొంతుచించుకుంటున్న తెలుగు సాహిత్య ప్రపంచం ఒక్కసారిగా శ్రీశ్రీ వైపు చూచింది. సామాన్య ప్రజల కష్టాలను తీర్చేలా కవిత్వం ఉండాలని కవి అంటే 'కష్టజీవి' కి ఇరువైపులా ఉండే వాడని నిర్వచనం చెప్పిన శ్రీశ్రీ ని తెలుగు ప్రపంచం 'భేష్' అని కీర్తించింది.

విశాఖపట్నంలో 1910లో జనవరి 2 న జన్మించిన శ్రీశ్రీ చిన్న వయసు నుండే కవిత్వం, పద్యాలు రాయడం ఆరంభించాడు. పూర్వపు సాహిత్యంతో పాటు ఆధునిక ఇంగ్లీషు సాహిత్యంలో కూడా చక్కగా నేర్చుకున్న శ్రీశ్రీ తెలుగు సాహిత్యకారులకు ప్రగతి మార్గం చూపి 'ఈ శతాబ్దం నాది' అని సగర్వంగా చెప్పుకోగలిగాడు. ఖడ్గసృష్టి, సిప్రాలి వంటి పలు కవితా సంపుటులు

రచించాడు. అంతేగాక సినిమా రంగంలో ప్రవేశించి అద్భుతమైన పాటలు రాశాడు. డబ్బింగు చిత్రాల రచయితగా తన తర్వాత రచయితలకు మార్గదర్శకుడయ్యాడు. తన జీవిత చరిత్రను 'అనంతం' పేరుతో రాశారు. పండితుల మధ్య బంధీ అయి వున్న తెలుగు సాహిత్యాన్ని సామాన్యుల దగ్గరికి లాక్కొచ్చిన కవి శ్రీశ్రీ. అంతరాలు వున్న ఈ సమాజాన్ని మార్చాలని పేద ప్రజల వైపు కవి నిలబడాలని భావించిన శ్రీశ్రీ తన చనిపోయేంతవరకు ఆ వైపునే ప్రయాణించాడు. తను జీవించిన కాలంలోనే తన దారిలో అనేక మంది యువకులను నడిచేలా చేసుకోగలిగిన గొప్ప కవి శ్రీరంగం శ్రీనివాసరావు. తెలుగు సాహిత్యంలో శ్రీశ్రీ స్ఫూర్తి శాశ్వతంగా నిలిచి ఉంటుంది. 1983, జూన్ 15 వ తేదిన మరణించిన శ్రీశ్రీ తెలుగు ప్రజల్లో ఎప్పుడూ చిరంజీవే.

## పచ్చని చెట్లు

పచ్చని చెట్లు ఉంటేనే
నల్లని మేఘాలొస్తాయి
పాడి పంటలు ఉంటేనే
సుఖ సంతోషాలొస్తాయి!

- విప్లవ్ దత్ శుక్లా

## సమాధానాలు : పదప్రహేళిక-7

అడ్డం : 1. ప్రకటన
5. శునకములు
6. ముచ్చిలుట

నిలువు : 2. కటకటాలు
3. నకులుడు
4. అశుద్ధము




Edited, Printed, Published & Owned by Dr. A. Prasad Rao, H.No. 1-9-312/3/G1, Vidyanagar, Hyderabad - 500 044, AP. Printed at Prajasakti Daily Printing Press, 1-1-60/2, RTC 'X' Roads, Hyderabad - 500 020, AP. Published at H.No. 1-1-187/1/2, Viveknagar, Chikkadapally, Hyderabad-500020, AP. **Editor: Dr. A. Prasad Rao**



| | |
|---|---|
| | మనసు ఫౌండేషన్<br>పుస్తకాల పరిశీలనాపట్టిక |

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A109 |
| పుస్తకం పేరు | మాయయ్య |
| తారీఖు | 25/5/24 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 53 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | M. Lavanya |
| పేజీలు విడదీసినది | M. Lavanya |
| స్కాన్ చేసినది | Rakshitha |
| పరీక్ష చేసినది | NANDINI |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good. |